

వీరభద్రస్వామి (వేదారణ్యం)

—ఫొటో: ఎ. వి. రామమూర్తి

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్ర వారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 51
సంచిక 4
26-9-56

దుర్ముఖ భాద్రపద బహుళ షష్ఠి బుధవారం

## విషయానుక్రమణిక



# నమ్మకాలు; చింతకాయలూ

మంత్రాలకు చింతకాయలు రాలవని సామెత; రాలుతాయని మన దేశంలో ఒక నమ్మకం.

కొన్ని సందర్భాలలో చింతకాయలు రాలనందువల్ల, వాటిమీద మనుషుల నమ్మకాలే రాలిపోయాయి! చింతకాయలు రాలగా చూచినవారికి నమ్మకాలు గట్టిగా నిలిచిపోయాయి.

బెణుకుమంత్రం మొదలు శాపం ఇవ్వడంవరకూ—తేలుమంత్రం, పాముమంత్రం, చేతబడి మొదలైన రకరకాల మంత్రాలు ఉన్నాయంటారు. క్రీస్తుశకంలో శాపాలకథలు వినకపోయినా, కనకపోయినా, అంతకన్న చిన్నరకం మంత్రాల గురించి, వాటి మహిమలను గురించి కథలు వింటునే ఉంటాం.

మీరు ఇవి నిజం అంటారా? ఉత్తి కథలంటారా? ఏమని దలచుకున్నా దాని రుజువు చేయడానికి మీకు తెలిసిన — జరిగిన కథలూ నిదర్శనాలు సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాసి పంపితే ప్రకటిస్తాము.

* * * *

“మంత్రాలు; నమ్మకాలు” శీర్షికకు అని స్పష్టంగా కవరుమీద వ్రాసి ఆంధ్ర సచిత్ర వారపత్రిక చిరునామాకు పంపండి.

—ఎడిటర్.

దూరపుకొండలు నునుపు అంటారు. బ్రిటన్‌లోని ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలు విశ్వవిఖ్యాతిగాంచిన ఆదర్శ విద్యాసంస్థలని మాత్రమే సాధారణంగా వింటూవుంటాము. అక్కడ తెరమరుగున వ్యాప్తిచెందుతున్న కొన్ని అసభ్యకలాపాలనుగురించి యూరప్‌యాత్రానుభవాలపై వ్రాసిన ఈ ఐదవవ్యాసంలో శ్రీ కృష్ణ తెలియజేస్తున్నారు.

# ఆక్స్‌ఫర్డులో శృంగారలీలలు

బ్రిటిష్ చరిత్ర ప్రఖ్యాతికి ఆ నగరంలో వున్న అతిసైతవంత్యమైన సంస్థలే ప్రస్ఫుటమైన నిదర్శనాలు. పార్లమెంటు భవనంలో ఎవరు ప్రవేశించినా అక్కడి వారు ముందుగా చూపించేది మొదటి చార్లెస్‌పై విచారణ జరిపిన స్థలాన్నే. ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలు బ్రిటిష్ జాతి సాంస్కృతిక చరిత్రను చాటే రెండు ఉత్తమ కావ్య గ్రంథాలలాంటివి. వాటిని చూస్తున్నంతసేపూ, ఎవరికైనా అదేదో స్వప్నజగత్తులో విహరిస్తున్నట్లు అనిపిస్తుంది; నాకూ అలాగే అనిపించింది

ఐదువారాలపాటు బ్రిటన్‌లో పర్యటించడానికి బ్రిటిష్ ప్రభుత్వం నన్ను ఆహ్వానించింది. అక్కడ నేను సందర్శించవలసిన స్థలాలలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాన్ని కూడా చేర్చారు స్పియర్, ఇయాన్ స్టీఫెన్స్ అనేవారి నిద్దరినీ (స్టీఫెన్స్ ఒకప్పుడు స్టేట్స్‌మన్ సంపాదకుడుగా పనిచేశాడు) కలుసుకొనవలసి వుంటుందనీ, వారితో ఇష్టాగోష్ఠి జరుపవచ్చుననీ నాకు ముందుగానే న్యూఢిల్లీ నుంచి ప్రయాణమై వెళ్ళకపూర్వమే తెలియజేశారు. నాకు వారిద్దరూ ఇదివరకే తెలుసు. స్పియర్ నేను ఒకప్పుడు చదువుకున్న సెయింట్ స్టీఫెన్స్ కళాశాలలో అధ్యాపకుడుగా పనిచేయడానికి భారతదేశంవచ్చాడు ఢిల్లీనిగురించీ, దాని చరిత్రనుగురించీ స్పియర్ అనేక పుస్తకాలుకూడా వ్రాశాడు. ఢిల్లీ చరిత్రమీద వ్రాయడమంటే నాకూ సరదే కొబట్టి, ఎప్పుడెప్పుడు స్పియర్‌ను కలుసుకుందామా అని కుతూహలపడ్డాను

ఇకపోతే, ఇయాన్ స్టీఫెన్స్ విషయం. ఇతను న్యూఢిల్లీలో భారత ప్రభుత్వ సమాచార శాఖ డైరెక్టరుగా పనిచేస్తున్నప్పుడే నాకు తొలి పరిచయం ఏర్పడింది ఇప్పటి ప్రిన్సిపాల్ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్‌నే అప్పుడు సమాచారశాఖ డైరెక్టర్ అని పిలిచేవారు కేంద్ర ప్రభుత్వ సెక్రటేరియట్ భవనంలోని దక్షిణవేపు వరస గదులలో ఒక విశాలమైన గానిలో కూర్చుని ఒక చేతిమీద చేతికర్రను ఆడిస్తూ, రెండో చేతితో పద్మపూసల తావళం ఒకదాన్ని తిప్పుతుండేవాడు, ఇయాన్ స్టీఫెన్స్. తలుచుకుంటే ఆ దృశ్యం ఇప్పటికీ స్పష్టంగా గుర్తుకు వస్తుంది. తర్వాత ఇతను "హారన్‌డ్ మూన్" అనే ఒక పుస్తకం వ్రాసి, అందులో భారతదేశంమీద దుమ్మెత్తి తూర్పార పట్టాడు.



విదేశీ సాంకేతిక నిపుణుల దిగుమతి కూడదని తమ 96 వ జన్మదినోత్సవ సందర్భంలో ఈ నెల 15 న బెంగుళూరులో ఉద్ఘాటించిన శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య.

తమ పరిపాలనకు అవసాన ఘడియలు అచిరకాలంలోనే సమీపిస్తున్నవనగా బ్రిటిషు ప్రభుత్వం భారతదేశంలో ప్రచార కార్యక్రమ బాధ్యతలను ఇయాన్ స్టీఫెన్స్, లయొనల్ ఫీల్డెన్ అనే ఇద్దరు ప్రబుద్ధుల మీద పెట్టడం విచిత్రంగానే కనిపిస్తుంది. ఈ ఇద్దరిలో ఒకరు కేంద్ర సమాచారశాఖ మీదా, మరొకరు ఆలిండియా రేడియో మీదా ఆధిపత్యం వహిస్తుండేవారు. ఈ ఉభయులూ కూడా భారతదేశానికి చివరకు ప్రబలశత్రువులుగా తయారైనారు. స్టీఫెన్స్ దృష్టిలో భారతదేశం అతినీచమైనది. ఇంత "నీచమైన" దేశంనుంచి వెళ్ళే ఇద్దరు పత్రికా విలేఖరులను కలుసుకోడానికి స్టీఫెన్స్ ఇష్టపడ్డాడంటే, మొత్తంమీద నాకు విపరీతమైన ఆశ్చర్యమే వేసింది అయితే చివరకు ఈ ఆశ్చర్యమంతా అనవసరమని తేలిపోయింది ఎందుచేతనంటారేమో? కేంబ్రిడ్జిలో స్టీఫెన్స్ అసలు మమ్ములను కలుసుకోవడమే తటస్థించలేదు. ఏదో పని మీద ఎక్కడికో హఠాత్తుగా వెళ్ళవలసి వచ్చిందని గాని, కలుసుకోలేక పోయినందుకు విచారపడుతున్నానని గాని ఒక చిన్న ఉత్తరంముక్క వ్రాసిపెట్టే మర్యాదకూడా అతనికి లేకపోయింది నేనూ, నా సహచరుడూ ఇద్దరమూ కేంబ్రిడ్జి చేరగానే, అక్కడి పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు మాకు ఆకా

# ఈ నెల మహత్తరమైన బంపర్!

**BHARATH CROSSWORDS** REGD NO. 1866.

**Rs. 3,00,000**

SPECIAL BUMPER
Closing Date
MOFUSSIL 6-10-56 : LOCAL 8-10-56

**4 PRIZES** — FIRST PRIZE Rs. 1,25,000 — RUNNERS UP Rs. 1,00,000 — SPECIAL BONUS Rs. 75,000 — SUBJECT TO RULES AND CONDITONS...

బయట ఊరు పోసు **6—10—56**     మదరాసు ముగింపు **8—10—56**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | భారతదేశము—కూడుకొన్న దేశమని వాసుడి | ... | గ్రామములతో | వ్యవసాయదారు |
| 2 | కొందరు గొప్ప—కలిగినప్పటికిని నిశ్చలముగ యుందురు | ... | జయము | అపజయము(లతో |
| 3 | —నిజాయితీగలవాడు ఇతరుల గౌరవము బడయును | ... | మాటయందు | కార్యమందు |
| 4 | ఆత్మనిగ్రహమువలన దురలవాటుల—వచ్చును | ... | నివారింప | సవరింప |
| 5 | ఒకరి మితిమీరిన భరించలేని—యున్న దానికి లొంగిపోవుదు | ... | బరువు | ఋణము |
| 6 | మహా తరమైన—గలవారు సహజంగా తుదకు జయము గాంతురు | ... | పట్టుదల | వివేకం |
| 7 | —పొరుగడియారం ఒకరిని కార్యక్రమాలందు సకాల పాలనపరుని చేయును | ... | వేగముగ | నిదానంగా |
| 8 | కొన్ని వేళల—వితండవాదము ప్రజలకు గొప్పహాని తెచ్చును | ... | మత | రాజకీయ |
| 9 | వివాహారద్దులు సహజంగా దంపతులమధ్య కలిగెడు గొప్ప—ఫలితములు | ... | సందేహముల | అనర్థముల |
| 10 | —జీవించు ఉద్దేశం ప్రతివారియందు ఎల్లప్పుడు ఉండును | ... | సౌకర్యంగా | సంతోషంగా |
| 11 | మనంతట మనమే—పెక్కు చిక్కులను మనము నివారింపవచ్చును | ... | చింతనసల్పిన | సాధించిన |
| 12 | క్షాత్రకము—ఎరగదని ప్రతీతి | ... | భీతిని | అపజయమును |
| 13 | నీతిమార్గము సర్వదా—నిండియుండును | ... | కష్టములతో | ఓటమితో |
| 14 | సర్వదా—పీడితుడైన మహదైశ్వర్యము నిష్ప్రయోజనము | ... | మనో | శరీర |
| 15 | గొప్ప రచయితల గ్రంథాలు మానవ—నిండియున్నవి | ... | అనుభవంతో | విజ్ఞానంతో |
| 16 | తీవ్రంగా గమనించిన దేరపీడితమైనమనస్సును దాని—చేత కనుగొనవచ్చును.. | | మాటల | చేతల |
| 17 | వేగంగా పరుగిడగలవారు తరచు మంచి—కలిగియుందురు | ... | సహనశక్తి | ఆరోగ్యము |

రూ. 1-0-0 1 వరుస   రూ. 3 కి 8 వరుసలు.   రూ. 6-కి 32 వరుసలు.   రూ. 14-కి 128 వరుసలు.
రూ. 26 కి 256 వరుసలు.   రూ. 100 కి 1040 వరుసలు.

| | |
|---|---|
| 1 | |
| 2 | |
| 3 | |
| 4 | |
| 5 | |
| 6 | |
| 7 | |
| 8 | |
| 9 | |
| 10 | |
| 11 | |
| 12 | |
| 13 | |
| 14 | |
| 15 | |
| 16 | |
| 17 | |

ముఖ్య గమనిక:—పోటీదారులు భారత్ క్రాస్‌వర్డ్స్ వరుసలకు బద్ధులు. మనీయార్డరు రసీదు లేక వచ్చుకూపనులును మద్రాసు ముగింపు తేదికి పిమ్మట వచ్చు కూపనులను నిరాకరింపబడును. జవాబుకు "రిప్లయికార్డు" వ్రాయుడు.

**విశేష బహుమతి!**

ఒక్కొక్క మొదటి బహుమతిదారునికి బోనసు 10 పౌనులు.
ఒక్కొక్క రెండవ బహుమతిదారునికి 1 పోర్టబిల్ గ్రామఫోను రు. 100/-
ఒక్కొక్క మూడవ బహుమతిదారునికి 1 వెండి కప్పు. (విలువ గలది)

అపూర్వ సందర్భము:—ఈ పోటీయందు ప్రత్యేక పోటీలో మొదటి బహుమతిదారులు ఒక్కొక్కరికి 1 వెండి కప్పు మాత్రము. (విశేష కూపను వివరములకు వ్రాయుడు.) ప్రత్యేక కాగితములోను 1-2 అని గుర్తు వేసి వ్రాయవలెను.

పేరు:________________________________

విలాసము:________________________________

M O. రసీదు నెం. ———రూ.———పోస్టల్ ఆర్డరు నెం.———తేది———

**No. 208**

భారత్ క్రాస్‌వర్డ్స్ (ప్రైవేట్) లిమిటెడ్, :: P. B. No 2426, మద్రాసు-2.

# ★ ఆక్స్‌ఫర్డులో శృంగారలీలలు ★

భంగం కలిగించినందుకు తన విచారం తెలియజేశాడు. స్టీఫెన్స్, స్పియర్ ఇద్దరూ కూడా హఠాత్తుగా అదృశ్యులైనారనీ, ఆ నగరంలో వున్న ఇతర ప్రముఖుల నెవరినైనా కలుసుకునేందుకు ఏర్పాటు చేద్దామంటే, తగిన వ్యవధి లేదనీ ఆ ఉద్యోగి అన్నాడు. ఈ విధంగా అక్కడ మా నిర్ణీత కార్యక్రమం భగ్నమై పోయింది

స్టీఫెన్స్‌ను ఎలాగా కలుసుకోలేకపోయాను కదా అతడి "సహచరుడు", ఆప్తమిత్రుడు అయిన బంట్రోతు రహీమ్‌ఖాన్ అనే అతడైనా ఎక్కడవున్నాడో తెలుసుకుందామని కొంత ప్రయత్నించాను. రహీమ్‌ఖాన్ ఎలాంటివాడో ఇయాన్ స్టీఫెన్స్ తన "హార్నెడ్ మూన్" అనే గ్రంథంలో ఇలా వర్ణించాడు:

## "ఆత్మీయుండు రహీమ్"

"నా సన్నిహిత బంటు, అత్యంత ఆత్మీయుడు అయిన రహీమ్‌ఖాన్, నేనూ పద్నాలుగు ఏళ్ళపాటు కలసిమెలసి వున్నాము. మా ఇద్దరికీ శరీరాలు మాత్రం రెండు గాని, ఆత్మ ఒకటే. నా హృదయంలో అతడికి చిరస్మరణీయమైన, శాశ్వతమైన స్థానం వున్నది. అనేక విధాల రహీమ్‌ఖాన్ పట్టి "ఖడవా" అనే చెప్పాలి. డబ్బు తెగ తగలేస్తాడు. వేళకు రాడు. జూదం ఆడతాడు. స్వల్పవిషయాలలో కూడా పరమ అవిశ్వాస పాత్రుడుగా ప్రవర్తిస్తాడు. అయితే మంచి కండపుష్టి, ఎముకపుష్టి కలిగిన పఠాన్. చాలా అందమైనవాడు! ఎంత అందమైనవాడో, అంత మందబుద్ధి. ప్రేమకలాపం విపరీతం. అందువల్లే తరచూ అనేక క్లిష్టపరిస్థితులలో చిక్కుకుంటూంటేవాడు. ఎదటివారిని వ్యామోహితులను చేయడానికి ఏ లక్షణాలు కావాలో, అవన్నీ రహీమ్‌లో మూర్తీభవించినవనే చెప్పవచ్చు. అతడితో కాలక్షేపం చేయడమంటే, బహు సరదాగా వుండేది; అనేక ఆశ్చర్య సంఘటనలు జరుగుతూండేవి. "నేను ఒకప్పుడు జబ్బుపడి లేచాను. నేను జబ్బులో వుండగా పాపం,! రహీం ఎంత ఆందోళన పడ్డాడో! నేను బాగా కోలుకున్న తర్వాత ఒక శ్రేష్ఠమైన ఉంగరం తెచ్చి నా వేలికి తొడిగాడు. దానిలో నా పేరుకు సరిపోయే మంచి విలువైన రాయిని (luckystone) కూడా పొదిగించాడు. తనకు వచ్చే నెలసరి జీతానికి రెట్టింపు ఖర్చుచేసి ఆ ఉంగరం చేయించాడు. ఇప్పటికీ ఆ ఉంగరాన్ని నేను ధరిస్తూనే వున్నాను. రహీమ్‌కు నేనన్నా, నాకు రహీమ్ అన్నా అపరిమితమైన ప్రేమ మమకారాలు పరస్పర విరుద్ధాలే అయినప్పటికీ, మేమిద్దరం ఒకరినొకరు పరస్పరం అభినందించుకుంటూ వుంటాము. నేనెక్కడో పుట్టాను; అతనుమరెక్కడో పుట్టాడు. అయినా అడవిలో



ముస్లింలీగ్ ముక్కచెక్కలుకాగా అవామీలీగ్ తరఫున పాకిస్థాన్ ప్రధాన మంత్రిపదవి స్వీకరించిన శ్రీ సురవర్దీ.

ఉసిరికాయకీ, సముద్రంలో ఉప్పుకూ ఏమిటి సంబంధం? మేమిద్దరమూ అలాగే తయారైనాము ఒక విధంగా అసాధారణమైన సమైక్య, మమైక్య వ్యక్తిత్వాన్ని అలవరుచుకున్నాము ఈ సమష్టి వ్యక్తిత్వం ఫలితంగానే, అదొక ఆత్మప్రేరణే అనండి, మరేమైనా అనండి మా ఇద్దరిలో ఏక్షణంలో ఎవరి మనస్సులో ఏ ఉద్దేశం, ఏ భావం కలుగుతుందో, ఏపని చేయాలనిపిస్తుందో ఉభయులకూ ఇట్టే తెలిసిపోయేది"

ఇదీ వీరిద్దరి గాథ!

## ఆక్స్‌ఫర్డు కళత్రం

ఇక పోతే, ఆక్స్‌ఫర్డ్ సంగతి సందర్భాలను గురించి తెలియజేస్తాను

'ఆక్స్‌ఫర్డ్ ట్రయంఫెంట్' అనే గ్రంథములో వార్మన్ లాంగ్ మేట్ అనే ఆయన ఈవిధంగా వర్ణించాడు:

"ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం స్త్రీ పురుషుల అతి సన్నిహిత సాహచర్యానికీ, ఏక లైంగికుల దుష్కామ కాంక్షకూ అసంఖ్యాకమయిన అవకాశాలను సమకూర్చే సంస్థ దుష్కర్మ ప్రియులకూ, పురుష మిథునాలకు కూడా ఆక్స్‌ఫర్డ్ పెట్టిన పేరు.

## [illegible] శృంగారలీలలు... ★

ఇలాంటి దుష్క్రియా ప్రియులు అనేక మంది ఉన్నారు. ఈ వికృతి వ్యామోహం ఆయా వ్యక్తులలో కొంతకాలం పాటు విపరీతంగా ప్రకోపించి, తర్వాత దానంతట అదే సర్దుకుంటుంది

"ఆక్స్‌ఫర్డ్ మద్యపాన శాలలకు మధ్య వయస్కులు, కొద్దిగా వయస్సుమళ్ళిన వారూ అనేకమంది తిరుగుతూ వస్తుంటారు. వీరిలో చాలామంది ఎప్పుడూ అపానశాలల దగ్గిర తారట్లాడుతుంటారు. ఆక్స్‌ఫర్డ్‌లో జరిగే ప్రతి పెదవిందుకూ విధిగా హాజరవుతుంటారు. పైనచెప్పిన దురభ్యాసవ్యాప్తికి వీరు ఒకవిధంగా ముఖ్యకారకులనే చెప్పవచ్చు. వీరిని ఆహ్వానిస్తేనే ఏ విందూ రక్తికట్టదని ఆయావిందులు ఏర్పాటుచేసేవారి అభిప్రాయం. ఇతరులుచేసే విందులన్నిటికీ హాజరుకావడమేగాక, తరుచూ తామకూడా విందులు ఏర్పాటుచేసి యువకులను పనికట్టుకుని ఆహ్వానిస్తూవుంటారు. ఆ విందులలోనే ఆ యువకుల అందచందాలను తెగపొగిడి వారిని ఉబ్బితబ్బిబ్బయ్యేట్టు చేస్తారు; లేనిపోని కల్లబొల్లి కబుర్లన్నీ చెప్పి మోసగించి అమాయకులైన వారిని వలలలో వేసుకుంటారు ఆక్స్‌ఫర్డ్ సామాజిక జీవితంలో ఇలాంటివారందరూ ప్రముఖ పాత్రలుగా తయారైనారు. పెద్దవాళ్ళు విందులకు ఆహ్వానించి కులాసాగా ఇంత తాగుడు పోయిస్తూ, తెగ పొగుడుతూ వుంటే, ఎంత లోకజ్ఞానం కలిగిన, ఎంత తెలివితేటలు కలిగిన యువకుడైనా ఏదో ఒక దౌర్బల్యక్షణంలో మోసపోక, చివరకు "దాసోహమనక" ఏమిచేస్తాడు? అంతటితో విందు జరిపిన పెద్దమనిషి ఒకమణిని. ఒక పెన్నిధిని కనుగొన్నట్టుగా మురిసిపోతాడు. ఈ మాయోపాయాలలో అమాయకులైన కుర్రవాళ్ళుమాత్రమే పడిపోతుంటారని చెప్పలేము. అంతకుముందే అన్నివిధాలా ఆరితేరిన, అనుభవజ్ఞులైన ఉద్దండపిండాలనదగినవాళ్ళుకూడా పడిపోతుంటారు. ఈ వికృత, విపరీత "శృంగారచేష్టలు" 1937లో లెక్కలేనన్ని జరుగుతూండేవంటారుగాని,

"ఈవిషయంలో మరికొన్ని ఉదాహరణలు చెబుతాను. ఇద్దరు యువకులు ఘర్షణపడుతూండగా నేను వినడం తటస్థించింది. ఇది కేవలం గమ్మత్తుకోసం జరుగుతున్న ఘర్షణకాదు. కొంతవరకు తీవ్రమైన ధోరణిలోనే దెబ్బలాడుకుంటున్నారు. 'గ్రిగిన్ నన్ను ప్రేమిస్తున్నాడోయ్' అన్నాడొకడు. 'పొరపాటు పడుతున్నావ్! అది అసంభవం! ఎంచేతనంటే, నిన్నగాక మొన్న నాలాంటి అందమైన యువకుణ్ణి మరెక్కడా చూడనేలేదన్నాడు' అని ఎదురువాదించాడు రెండోవాడు ఇదీ వారి ఘర్షణతీరు!

ఇకపోతే నటులవిషయం వీరు పైకిచూడడానికి బహు సహజమైన మనుషులు లాగే కనిపిస్తుంటారు. ఆక్స్‌ఫర్డ్‌లో ఎక్కడ చూడబోయినా ఇలాంటవాళ్లు కనిపిస్తుంటారు వీరందరూ ఒకరినొకరే గాక, మామూలు పరిచయస్తులను కూడా "ఓ! డియర్!", "ఓ! డార్లింగ్" అనే సంబోధిస్తుంటుంటారు. ఒక్కొక్కప్పుడు ఈ "ప్రణయ కొండలలో" తమతమ పురుష సింహాల కోసం పోటాపోటీలు, తీవ్రమైన ఈర్ష్యలు కూడా ఉద్భవిస్తుంటవి.

"ఒకప్పుడు ఆక్స్‌ఫర్డ్ కళాశాలలో ఒక పెద్ద విందు జరిగింది పాల్గొన్న వారందరూ ఈ దుష్క్రియాలోలురైనా యువకులే నా స్నేహితుడు ఒకాయన 'ఆ యువక బృందం'లో పిలవని పేరంటంగా దూరిపోయి పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించాడు. దాన్ని "మేకె ప్యారీల" విందుగా ఆ మిత్రుడు వర్ణించాడు అతిథులందరూ షోకైన దుస్తులు వేసుకున్నారు. అందరి మొహాలలో ఆడకళలు ఉట్టిపడుతున్నవి. వీరిలో ఆక్స్‌ఫర్డ్‌లోని నాటకాల నిర్వాహకర్తకూడా ఒకాయన వున్నాడు. ఘర్షణపడుతున్నట్టు పైన వర్ణించిన ఆ ఇద్దరు యువకులుకూడా వున్నారు విందుహాలులో జతలు జతలుగా వీరు ఒకరినొకరు గాఢాలింగనాలు చేసుకుంటూ గ్రామఫోను పాటకు లయగలుపుతూ 'డాన్స్' చేస్తున్నారు. మరికొంతమంది పుష్కలంగా తాగి జంటలు జంటలుగా విడిపోయి. కిలకిలా రావాలు చేస్తూ, కేరింతలు కొడుతూ మసకచీకటిగా వున్న హాలు మారుమూలలకు చేరుకుంటున్నారు. ఈ బృందంలో కొంతమంది పెదవులకు 'లిప్‌స్టిక్' వేసుకొని, కనుబొమలకు నల్లరంగు పూసుకొని ఆడవాళ్ళను తలతన్నేలా అలంకరణలు చేసుకున్నారు. హాలు. దాని పరిసరాలు సెంట్ల వాసనలతో ఘుమఘుమలాడిపోతున్నవి. ఒక్కొక్క పురుష పుంగవుడే 'తన దంపతిని' తన బాహుపరిష్వంగంలో చేర్చుకొని పక్కనవున్న పడకగదిలోకి నిష్క్రమించడం ప్రారంభించాడు. ఆ గదులలో జరిగిన శృంగార చేష్టలు, ప్రణయ ప్రదర్శనాలు ఇన్నీ అన్నీ కావు! ఒక గదిలో ఒక 'ప్రేయసి' తన ప్రియుడి ఆలింగనంలో చిన్న ప్రణయ కలహాన్ని నటిస్తున్నది. (నటిస్తున్నాడనాలేమో) సగంఇష్టమున్నట్లు, సగంఇష్టంలేనట్లు మామూలు స్త్రీలు ఆడే నాటకం మాదిరిగానే వుంది, ఈ నటనకూడా. అర్ధరాత్రి కావస్తున్నదనగానే ఈ అండర్ గ్రాడ్యుయేట్లందరూ తమతమ కళాశాలల హాస్టళ్ళకు చేరుకోడానికి తయారుకావాలి ఆఖరుక్షణాలలో జంటలు పెట్టుకునే ముద్దులను, వియోగబాధతో 'గుడ్ నైట్' చెప్పుకునే వీడ్కోలు ఘట్టాన్నీ చూసి ముక్కుమీద వేలు వేసుకోవలసిందేగానీ, వర్ణించలేము"

ఇవన్నీ జరుగుతూండగా చూసి చెప్పే ప్రత్యక్షసాక్షులు దొరకడం కష్టమే అయినప్పటికీ, ఇన్ని వైపరీత్యాలు ఆక్స్‌ఫర్డులో తరుచూ జరుగుతూండేమాట మాత్రం వాస్తవం. "ఐసిస్" అనే పత్రికలో ఈ వ్యవహారాలను గురించిన చమత్కృతులు, వ్యంగ్య చిత్రాలు తరుచూ పడుతూవుంటవి. 1951 ఫిబ్రవరి 14 వ తేదీ పత్రికలలో ఒక చిన్న వ్యంగ్య చిత్రాన్ని ప్రచురించారు. "మీరు చూస్తున్నారే ఆ వ్యక్తి స్త్రీ కాదు. ఇదివరలో ఆయన నా పెనిమిటే" అంటున్నది ఒక ఇల్లాలు ఈ చిత్రంలో, "వింత జీవులు" అనే శీర్షిక క్రింద వీరి వృత్తాంతాలను ఈ పత్రికలో తరుచూ ప్రకటిస్తూంటుంది.

ఆడవాళ్ళను గురించిన వికృతి గాథలు ఇలాంటివి అట్టే తెలియరావు. ఎక్కడో ఒక కళాశాల 'అధిపత్ని' తన అభిమాన విద్యార్థినిని అత్యంత ప్రేమాదరణలతో చూస్తుందనే వదంతులేవో వినవస్తుంటవి ఇద్దరు స్త్రీలు ఏకశయ్యాగతులై కలసి ఏదో చదువుకున్నారని డొరొతీసేయర్స్ వ్రాసిన 'గాడీ నైట్' లాంటి పుస్తకాలలో అక్కడక్కడ ప్రసక్తులుమాత్రం కనిపిస్తుంటవి.

కేంబ్రిడ్జి సమీపంలోనే చెర్వెల్ నదీతీరంలో కళాశాల అధ్యాపకులు-స్త్రీలు-పురుషులుకూడా బహు తరుచుగా విలాసార్థం వెళ్ళే "పార్సన్స్ ప్లెషర్" అనే ఒక సరోవర విహారస్థలం ఉన్నది. ఈ స్థలానికి వాహ్యాళివెళ్ళే ఆచారాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఏనాడో నిషేధించి ఉండవలసింది నదిలో విహారార్థం వెళ్ళేవారంతా ఈ సరోవరంగుండా వెళ్ళవలసి ఉంటుంది. అక్కడ ముద్దులలాగా పెద్దపెద్దవాళ్లే సరోవరతీరంలో నగ్నంగా స్నానాలు చేస్తూ విహరిస్తుంటారు. డింగీలలో ప్రయాణంచేసే స్త్రీలు అక్కడే దిగి వాహ్యాళి జరుపుతుంటారు ఇంత బహిరంగ ప్రదేశంలో ఈ చండాలపు దృశ్యాలను బ్రిటిష్ ప్రభుత్వం ఎంత త్వరగా నిషేధిస్తే అంత మంచిది.

లండన్ పత్రికలు ఈ దురాచారాన్ని రూపుమాపడానికి శక్తివంచన లేకుండా కృషి చేస్తూనేవున్నవి. వారి కృషి ఫలిస్తుందనే ఆశిద్దాము. ★

# "ఎడమిల్లై" లోకంనుంచి



# "జాగానై" లోకానికి



# హైదరాబాదు వెళ్లే ఆంధ్ర ఉద్యోగులకు ఆహ్వానం

నేను స్వానుభవంతో చాటే ఈ సందేశం వినండి నేను ఇక్కడ పౌరుణ్ణి అయ్యాను; మీరు కాబోతున్నారు కాబట్టి నేను మీ కంటే సీనియర్ని మీరు ఉద్యోగ హోదాలో వస్తారేమో; నేను ఉద్యోగాన్ని వెతుక్కుంటూ వచ్చాను. మీలాంటి పెద్దల ఆశీర్వాద బలంవల్ల ఏదో చిన్న ఉద్యోగం (ముల్కీతో నిమిత్తం లేనిది!) "బతుకలేక చేసేది" సంపాదించాను ఇక్కడ నా అనుభవాలు చెబుతాను; చిత్తగించండి

మీరు సికింద్రాబాదులో ఎందుకు దిగుతారు? హైదరాబాదుకే రండీ రైలు సికింద్రాబాదులో అనవసరంగా గంటసేపు ఆగుతుంది. నేనా? అప్పుడే భయపడితే ఎట్లా? మీరు కాజీపేట వచ్చేసరికి (ప్యాసింజర్లో) తెల్లవారుతుంది. అక్కడనుంచే మొదలు, "చాయ్ బోలో...చాయ్ గరంచాయ్" "ఠండా చాయ్" కూడా అమ్ముతారేమో మరి!!

మనకు ప్రత్యేక రాష్ట్రం రానివ్వండి, విశాల రాష్ట్రం రానివ్వండి; మన భాషకు తగిన గౌరవస్థానం లభిస్తుందా? ఆంధ్రాభిమానంతో పరవళ్ళు తొక్కుతున్న ప్రతి ఆంధ్రుడు, "రోమన్ ఇన్ రోమ్" లాగా తయారవుతాడు.

'ఏ దేశమేగినా ఎందు కాలిడినా,' అది పుటుకతో పుట్టిన బుద్ధి మరి మద్రాసులో నాలుగు కాలాలపాటుండి నాలుగు అరవం ముక్కలు నేర్చిన ఆంధ్రాభిమానులే అరవములో మాట్లాడి అరవంరాని తెలుగువారిని ఇబ్బంది పెట్టి హేళనచేసిన సమయాలు లేకపోలేదు గదా? ఇక్కడికి వచ్చిన చాలామంది కూడా అట్లాగే ప్రవర్తిస్తారు మీకె హాను అభిమానంగా ఎన్నిసార్లు ప్రవర్తించారో జ్ఞాపకం చేసుకోండి. మా 'గతీ యిక్కడా అంతే!' (హిందీ రానిపక్షంలో.)

రాజధానీ నగరం సహజంగా ఆ రాష్ట్ర ప్రజల సంస్కృతికి చిహ్నంగా వుండాలి మన కాబోయే రాజధానికి అదితప్ప మిగిలినవన్నీ ఉన్నాయి దాన్ని మీరెందుకు నమ్మచేయాలి? కనుక శీఘ్రమే వేంచేసి, నాలుగు ఉర్దూముక్కలు నేర్చుకొని, రాబోయే ఆంధ్రసోదరులను హేళనచేయండి! లెండి, మన ప్రత్యేకత నిలబెట్టండి; పదండి; పదండి!

ఉన్నదున్నట్టుగా, ప్రస్తుత పరిస్థితి ఇది. రిక్షావాడిని తెలుగులో పలకరిస్తే పలకడు

"శర్మ"

పలికినా, రెండణాలదానికి పన్నెండణాలు ఇమ్మంటాడు. లేకపోతే "జావ్" అంటాడు. వెంటనే మన ప్రక్కనున్న వాడిని "అయియే సాబ్!" (దయచేయండి స్వామీ!) అంటాడు. ఇక మిగిలిన దుకాణాల సంగతి ప్రస్తావించ నక్కర్లేదుగా!! పనివారు మాత్రం చుట్టుపక్కల పల్లెలనుంచి వచ్చినవారు. వారు తెలుగే మాట్లాడుతారు. పెద్దలందరికీ పనివారు లేనిదే జరగదుగా! అందుకని అందరికీ తెలుగు తెలుసు సూక్ష్మంలో చెప్పాలంటే, తెలుగు సేవక భాష; హిందీ (ఉర్దూ) రాజభాష అన్నమాట! ఇదంతా ఆంధ్ర రాజధానిలో నే సుమా!!

ఇక పేటలపేరు క్రొత్తవారికి వినసొంపుగా ఉంటాయి మైలాపూరు, అడయారు, ఎగ్మూరు, మాంబళం, మీనంబాకం, గిండి, తాంబరం ఇటాంటివేగా మీరు ఇప్పటివరకూ వింటున్నది ఇక, 'మనవి' చూడండి. నాంపల్లి, మల్లేపల్లి, లింగంపల్లి. బాగున్నాయి గదాపు తెలుగు పేర్లే కొంచెం ఆగండి: కాచిగూడ, కవాడీగూడ, కుట్టిగూడ, గౌలిగూడ, దోమల్ గూడ, దంబల్ గూడ...ఎటాఉన్నాయి? బేగం బజారు, సుల్తాను బజారు. త్రూప్ బజారు, ఇసామియా బజారు...ఇవి వీధులు గావు సుమా!! ఇవీ పేటలే!!! ఆసిఫ్‌నగర్, హైదర్ గూడ...ఏమిటి ఎక్కడా నెహ్రూ నగర్," "గాంధీనగర్" అని లేనేలేవే అనుకుంటున్నారా? మీరొచ్చి, అట్లా నామకరణం చేయండి

సిటీ బస్సుల్లో మాత్రం మీరు అంతగా బాధపడనక్కరలేదు కండక్టర్లు అందరూ తెలుగు మాట్లాడగలరు, పలకరించటం ఉర్దూలో అయినప్పటికీ మీకు పెద్ద మార్పేమీ ఉండదు "ఎడమిల్లే" నుంచి 'జాగానై' అంతే! కాగా ఇక్కడ తెలుగు తెలియుం దెరివకి, మాట్లాడితే పరువుపోతుందని కాని?

ఆ తెలుగు మాత్రం ఎంత? ప్రతిషాపుకూ (దాదాపు) తెలుగు సైన్‌బోర్డు ఉంటుంది. ఆ తెలుగుమీద మాత్రం ఆటే ఆధారపడకండి. ఎందుకంటే "Ahmadia" అని ఇంగ్లీషులో ఉంటే, "అహమదియ్యా" అని తెలుగులో ఉంటుంది! "హైదరాబాదును" "హైదరాబాగు" అని వ్రాస్తారు పెద్ద అక్షరాల్లో. ఇట్లాంటివి ఎన్నైనా చెప్పవచ్చు.

ఎవరన్నా దయతలచి తెలుగు మాట్లాడదలిస్తే, ముందు ఉర్దూలో ఆలోచిస్తారు (విశ్వనాథవారి భాషలో) ఏదైనా సక్రమంగా ఉన్నప్పుడు "అచ్ఛా హై"

(మంచిది) అనీ, చెప్పండి అనవలసినప్పుడు, "ఆప్ బోలీయే" నుంచి 'తమరు చెప్పండి' అనీ అంటారు. భాషంతా ఉర్దూపదాల మయం. జాగ్రత్తగా వినకపోతే, మనకేమీ అర్థంగాదు. ఉదాహరణకు జరా (కొంచెము), జల్దీ (త్వరగా), యాద్ (జ్ఞాపకం), ఇలాంటివి బాగా పరిచితోయాయి ఇలాంటి మాటలను లెక్క వేయలేము

అంకెలు మాత్రం ఎప్పుడూ ఉర్దూలోనే చెప్పండి లేకపోతే, ఇక్కడ ఎవరికీ. అర్థం గాదు. ఆదా అనే (0 0-6), ఏక్ అనే (0.1-0), దొడ్ అనే (0-6-0), దో అనే (0-2-0), అడై అనే (0 2-6), తీన్ అనే (0-3 0) సాడే తీన్ అనే (0-3-6) ఇత్యాదులు.

చాకలి కుర్రవాడు గుడ్డలు ఎంచుతూ, మధ్యలో, "నాకు మీ లెక్క రాదు" అన్నాడు; అన్నిటినీ కలిపి వేసి, తిరిగి లెక్కించి, "సోలా" (16) అని చెప్పాడు!

బహుకాలం ఉర్దూ సేవచేయడంవల్ల ఇది సంభవించి ఉండవచ్చు. అనేకమంది తెలుగు వారు తెలుగు వ్రాయలేరు. చదవలేరు. ఉర్దూ వ్రాస్తారు; చదువుతారు కూడా. కోటివిద్యలూ కూటికొరకే గదా మరి!!

విశాలాంధ్ర నిర్మాణానికి ప్రతిఘటన రావలసిన మహమ్మదీయులనుంచి ఉద్యమానికి అండ లభించింది. ఎక్కువ ప్రతిఘటన వచ్చింది. రాజభాష. మాతృభాషగా ఉన్న హిందీవారినుంచీ, తెలుగు రాజ్యంలో "మన ఆటకట్టు" అను కొన్న ఇతరులనుంచీ మాత్రమే. ఆంధ్ర నుంచి వచ్చాననగానే, ఛిదరించుకుంటారు; హేళనచేస్తారు; ఏమేమో చేస్తారు. కాని ఎవరింటికి వారొస్తున్నారు అన్న జ్ఞానం మాత్రం వారికి కలిగినట్లు కనిపించదు. ఒక్కొక్కసారి హిందీనుంచి మనల్ని రక్షించడానికి ఒక రామస్వామినాయకర్ అవసరమా అనిపిస్తుంది. హైద్రాబాదు విచ్ఛిత్తి రాజ్యాంగ విరుద్ధమని ప్రధాని నెహ్రూమొదలు అందరినీ ఇక్కడ కొందరు దుయ్యబట్టారు...ఇక వారిసంగతి మీరు చూడవలసిందేగాని, నేను చెప్పలేను.

మీ పిల్లల్ని గురించి మీరు భయపడ వలసిన పనిలేదు. ఇక్కడ రోడ్ సైడ్ రోమియోలు మచ్చుకైనా లేరు...మీపిల్లల్ని బాధించటానికి.

నేను ఇన్ని చెప్పినప్పటికీ, మీకై మీరు చూడవలసినవి చాలా ఉన్నాయి. కాబట్టి రండి, అనుభవించండి!

నే చెప్పొచ్చేదేమంటే, ఆంధ్ర రాజధానిలో ఆంధ్రభాషకు స్థానాన్ని వృద్ధి చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది ★




# పట్టాలుతప్పిన ప్రజాస్వామ్యంలో పండిత్ పంత్‌కు బ్రహ్మరథం

★

**శ్రీ కృష్ణ**
(ఆంధ్రపత్రిక విలేఖరి)

★

ఈ నెల 10వ తేదీన హోమ్ శాఖా మంత్రిగారి జన్మదినోత్సవం కాన్స్టిట్యూషన్ క్లబ్బులో వైభవంగా జరగడంతో ఢిల్లీలో జన్మదినోత్సవాల సీజను ప్రారంభమైంది. హోంశాఖ మంత్రిపదవి ప్రాధాన్యము, ముఖ్యంగా శ్రీ పండిట్ గోవింద వల్లభపంత్ గారి ప్రాధాన్యము ఢిల్లీలోని దేశభక్తులకు ఇప్పుడే మొదటిసారిగా తెలిసి వచ్చినట్లు కనిపిస్తుంది. ఈ చరిత్రాత్మక దినం జరపడానికి పలువురు ప్రముఖులు పూనుకున్నారు. ఈ ప్రముఖులలో రెండు తెగలవారున్నారు. ఒక తెగవారి పేర్లు ఆహ్వానపత్రిక మీదనే ముద్రింపబడ్డాయి. మరొక తెగవారి పేర్లు ఆహ్వానపత్రంతో పాటు వేరే పంపించబడ్డాయి. పత్రంమీద మొదటివరసలో ఢిల్లీ శాసనసభ స్పీకరు డా॥ సుశీలానయ్యర్, ఢిల్లీ కాంగ్రెసు అధ్యక్షురాలు శ్రీమతి సుభద్రాజోషీ, ఢిల్లీ మునిసిపల్ కమిటీ అధ్యక్షుడు శ్రీ ఆర్. ఎస్. అగర్వాల్ పేర్లు ఉన్నాయి. డా॥ సుశీలానయ్యర్ పేరుక్రింద ఢిల్లీ ముఖ్యమంత్రి, ఢిల్లీ ఆరోగ్యమంత్రి, ఢిల్లీ అభివృద్ధిశాఖ మంత్రి, ఢిల్లీ శాసనసభ డిప్యూటీ స్పీకరు పేర్లు ఉన్నాయి. బిర్లా బట్టలమిలు యజమానులు, బి కె బాలి, బి కె జేసి, గ్లోబ్ మోటార్స్ కంపెనీ, "మహేష్ మీ వాలా", బ్రెవిల్యాన్ ఎండ్ క్లార్క్, రాజేంద్రనగర్ మార్కెట్ సంఘం మొదలైన పేర్లు కూడా కనిపిస్తాయి

## సూర్యనమస్కారాలు

ఇలాగ జన్మదినోత్సవాలు చేసే ఆచారం భారతీయ సంస్కృతిలో భాగమే. ఇది సూర్యనమస్కారాల క్రిందికి వస్తుంది అంటే, ఉదయించే సూర్యుని ఆరాధించడమన్న మాట. శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారిగారు ఒకప్పుడు హోంశాఖ మంత్రిగాను, ప్రథమ భారతీయ గవర్నరు జనరల్ గాను కూడా పనిచేశారు. ఇప్పుడు శ్రీ పంత్ జన్మదినోత్సవ అభినందన సంఘ సభ్యులుగా ఉన్నవారిలో ఎంతమంది శ్రీ రాజగోపాలాచారి జన్మదినం జ్ఞాపకం పెట్టుకున్నారు? ఎంతమంది ఆయనకు అభినందన సందేశాలు పంపించారు? అభినందనలు మంత్రిత్వ పదవికి చెందాలేగాని పదవిలో ఉన్న వ్యక్తికి కాదు. స్వాతంత్ర్యం వచ్చినా భారతదేశంలోని, ముఖ్యంగా ఢిల్లీలోని స్త్రీ పురుషుల మనస్తత్వాలు మారలేదని విదితమవుతున్నది. బ్రిటిష్ పరిపాలన కాలంలో బిరుదులు పొందిన పెద్దమనుషులు, బిరుదుల వేట సాగించే పెద్దమనుషులు శాలవారోత్సవాలు జరిపేవారు. యుద్ధనిధి సేకరణ సంఘాలు స్థాపించేవారు. పాలకుల ప్రీత్యర్థం గోశాలలకు అంబోతుల్ని బహూకరించేవారు



హోంశాఖమంత్రి పండిత్ గోవింద వల్లభ్‌పంత్ ఈనెల 10వ తేదీన 70వ జన్మదినోత్సవం జరుపుకున్నారు.

## చింత చచ్చినా....

ఇక్కడ రెండు ప్రశ్నలెదురవుతాయి. జన్మదినోత్సవాలు భారతీయులకు ఆనూచానంగా వస్తున్న సంప్రదాయమా? రామాయణ భారతాది గ్రంథాల్లో పురాణవీరుల కెవరికైనా ఇలా జన్మదినోత్సవాలు జరిగేవా? భారతదేశం పాలించిన ముస్లిం రాజులు జన్మదినోత్సవాలు చేసుకునేవారా? ఇవి చనిపోయిన బ్రిటిష్ దొరతనపు "చింతతాలూకు పులుపులు" బ్రిటిష్‌వాళ్ళయినా తమ రాజు, రాణి జన్మదినోత్సవాలే చేస్తారుగాని ప్రతీ మంత్రి జన్మదినోత్సవం చేయరు ఇంగ్లండు రాణి జన్మదినాన కూడా సెలవు వుండదు.

రెండో ప్రశ్న: పండిట్ పంత్‌కు ఈ ఏడాది ఏమిటింతగా బ్రహ్మరథం పట్టే

# న్యూఢిల్లీ లేఖ

స్తున్నారు? ఆయనకి కిందటేడుకూడా ఇలాంటి జన్మదినమే సంభవించింది. కాని మరీ ఇప్పుడు జరిగినంత కుంభమేళమంత తొక్కిడిగా జరగలేదు. ప్రజలింతగా ఆయన్ని ఆకాశానికెత్తేయదగినంత బ్రహ్మాండమైన పనేదైనా పంత్ జీ చేసి కారా? లేక ఆయనకేవన్నా సుస్తీ చేసి యావత్తు దేశం అభినందనలర్పించవలసిన సమయం ఆసన్నమయిందా? ఒక చిన్న తమాషా ఏమిటంటే ఆహ్వానపత్రంలో అగ్రశ్రేణి వ్యక్తులో నలుగురు వచ్చేనవంబరు 1 నుండీ నిరుద్యోగులైపోతారు. ఢిల్లీరాష్ట్రం రద్దుకావడంతో డా॥ సుశీలానయ్యర్, సర్దార్ గురుముఖ్ నిహాల్ సింగ్, డా॥ యదువీర్ సింగ్, చౌధురీ బ్రహ్మప్రకాశ్ గార్ల ఉద్యోగాలుపోతాయి. ఇక మిగతా అగ్రశ్రేణి వ్యక్తుల్లో కొందరు పార్లమెంటులో సీట్లు ఖాళీచేసిపోతూ మళ్లీ ఎన్నికలకు నిలబడదామని ఆశించేవారు, మిగతావారు ఎన్నికల్లో నిలబడేందుకు టిక్కెట్లకోసం అర్రులు చాచేవారు. నిజానికి, చేసిన దేశసేవని బట్టిగాని, హోదాని బట్టిగాని ఆహ్వానపత్రం మీద పేర్లు ముద్రించేటట్లయితే పునరావాస శాఖ మంత్రి, రాజ్యసభలోని ఢిల్లీ ఏకైక ప్రతినిధి అయిన శ్రీ మెహర్ చంద్ ఖన్నా పేరు అన్నిటికంటె పైన ఉండదగినది కాని ఆయన పేరు అసలు పత్రంలో లేక పోగా దాంతోపాటు పంపించిన వేరే కొపరు పత్రంలో వర్తకుల, పారిశ్రామికుల, సారా దుకాణదారుల పేర్లతో పాటు ముద్రించబడింది.

## వ్యక్తిభక్తి

రష్యాలో స్టాలిన్ నిరసన జరిగినప్పటి నుంచీ మన దేశంలో కూడా ప్రధాని నెహ్రూ వ్యక్తి ఆరాధనను నిరసిస్తూవచ్చారు. ఈ జన్మదినోత్సవాలు వ్యక్తి ఆరాధన కిందికి రావా?

పంచవర్ష ప్రణాళిక అమలు చెయ్యడానికి ప్రతిపైసా జాగ్రత్తగా తూచివాడవలసిన సమయమిది. కాని రకరకాల ఉత్సవాలకి, విదేశాలకు ఎడతెగకుండా వెళ్లే ప్రతినిధి వర్గాలకి అయ్యే ఖర్చు నానాటికీ పెరుగుతోందే తప్ప తరగడం లేదు. పదవుల కోసం, ఉద్యోగాలకోసం ప్రాకులాడేవారు ఎన్నో మార్గాలవలంబిస్తూంటారు. అగ్రనాయకులైన వారుకూడా ఇటువంటి స్వార్థపరుల చర్యలనెందుకు సహించి ఊరుకుంటారో తెలియడంలేదు. బహుశా వారి దృష్టి ఇంకా పై పదవుల మీద ఉండి ఉండవచ్చును.

# బాలమహోత్సవం

బి. వి. సింగరాచార్య

జగదానంద మహాంబుధి తటమున
సాగును బాల మహోత్సవము
పైన నిశ్చలా పారాకాశము
ప్రక్క పొరలి పొంగెత్తెను సంద్రము
అనంత జగదంభోధి తీరమున
వాడగ పాపలు కూడుదురు

ఇసుకతోనె వారిండు కట్టెదరు
ఎండుగుల్ల లేరుకొని పెద రాడగ
వాడిన ఆకుల పడవల గట్టుచు
వారాంనిధి పయనింపగ విడుతురు
జగదానంద మహాంబుధి తటమున
సాగును బాల మహోత్సవము

ఈతలు కొట్టుట లెరుగరు పాపలు
ఎరుగ రసలె వలపన్ని లాగుటలు
ముత్తెపు బెస్తలు మునుగుదు రంబుధి
పోవుచుండు వ్యాపారుల నౌకలు
పాప లిసుకలో పలుగురా లేరి
పారవేయుదురు మరల నల్దెసల

కోరరు పాపలు గుప్తార్థమ్ములు
నేర రసలె వల పన్ని లాగుటలు
జలధి నవ్వుకొను కలకల నురగల
తెల్లవోవు తీరపు చిరునగవులు
జగదానంద మహాంబుధి తటమున
సాగును బాల మహోత్సవము.

పాపల నూయెల లూపుచు తల్లులు
బాళిని జోలలు పాడెడి భణితుల
విరిగి యెగురు భీకర తరంగములు
కరగి పాడు భావరహిత గీతులు;
పిల్లలతో నాడుకొను సముద్రుడు
తెల్లవోవు తీరపు చిరునగవులు
జగదానంద మహాంబుధి తటమున
సాగును బాలమహోత్సవము.

దారిలేని ద్యోస్థలి పెనుతుపాను
హోరువెట్టుచు విహారము సల్పగ
దారిలేని సంద్రముపై పడవలు
తరగల కడుపున దాగిపోయినవి
మృత్యు వెల్లెడల నృత్యము సల్పగ
నెప్పటివలె నాడెదరు బాలకులు
జగదానంద మహాంబుధి తటమున
సాగును బాలమహోసభలు.

* రవీంద్ర 'గీతాంజలి' నుండి.

# న్యూఢిల్లీ లేఖ

ఈ అభినందన ఉత్సవాలలో బాలబాలికలను నిర్దాక్షిణ్యంగా ఉపయోగించుకోవడం మరీ దారుణం. ఇది వ్యక్తి ఆరాధన దురాచారాన్ని ఉగుపాలతో పట్టి నేర్పినట్లు మనిషిని దేవుడుగా భావించి పూజచేయించినట్లు అవుతుంది. పైకి పోదలచుకున్న స్వార్థపరులు అభినందన సమావేశాలకు బాలబాలికల్ని హాజరు చేయించి వారి బుజాల మీదెక్కి పైకిపోవ చూస్తారు.

పంత్ జీ మాత్రం ఊరుకున్నారా? వ్యక్తి ఆరాధకులకే మేము బహుమతులిచ్చేదీ ప్రకటించేశారు. పట్టాలు తప్పిన ప్రజాస్వామ్యం అంటే ఇదే.

ఢిల్లీ రాష్ట్రాన్ని చేజిక్కించుకున్న కాంగ్రెసు నాయకీ నాయకులు ఢిల్లీకి సలహామండలి ఉండరాదని ముక్తకంఠంతో గోలచేస్తున్నారు. కాని పంత్ జీ మాత్రం ఢిల్లీ ప్రజలకు సలహామండలిని అంటగడుతున్నారు. ఈమండలిలో 8 మంది పార్లమెంటు సభ్యులు, ఢిల్లీ పరిపాలకుడు, ఢిల్లీ విశ్వ విద్యాలయ వైస్ చాన్సెలరు, ఢిల్లీ కార్పొరేషన్ మేయరు ఉంటారు.

కన్నాట్ ప్లేస్ లో నివసిస్తూనో, వ్యాపారం చేసుకుంటూనో ఉండే దుకాణదార్లు, తదితరులు తమకు ఢిల్లీ కార్పొరేషన్ అక్కర్లేదని ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. ఖద్దరు ధారులైన కొందరు వ్యక్తులు న్యూఢిల్లీ నంతటినీ మునిసిపల్ కార్పొరేషన్‌లో చేర్చాలని వాదిస్తున్నారు. కేంద్ర మంత్రివర్గం ఇంకా ఎటూ నిశ్చయించలేదని తెలుస్తున్నది. కాని ఈలోగా పంత్ జీ మాత్రం కన్నాట్ ప్లేస్‌లో ఉండేవారిని నయానో, భయానో ఢిల్లీ మునిసిపల్ కార్పొరేషన్‌లో చేర్చి వేస్తామని పార్లమెంటులో ప్రకటించారు.

ప్రజాస్వామ్యం బాధ్యతాయుతమైనది. అయితే ఈసూత్రం పాశ్చాత్య దేశాల్లో పుట్టింది. ఢిల్లీలో మునిసిపల్ కార్పొరేషన్ ముగ్గురు కౌన్సిలర్లను ఎన్నుకుంటుంది. ఈముగ్గురూ వెంటనే కార్పొరేషన్‌కు రాజీనామా ఇచ్చి ఢిల్లీ పరిపాలకునికి సలహాదార్లుగా వ్యవహరిస్తారు. వీరికి జీతభత్యాలుంటాయి పరిశ్రమలు, విద్య, ఆరోగ్యం వీరిచేతుల్లో ఉంటాయి ఢిల్లీ ప్రజలకు మంత్రివర్గ పరిపాలన అంటగట్టిన దరిమిలా జరిగిన పార్టీ కుట్రలు, ఘర్షణ అనంతరం ఫజులాలీ సంఘం ఈమంత్రుల పరిపాలన రద్దుచేయాలని సూచించింది శ్రీ పంత్ జీ ఈకుట్రదారుల్లో కొందరికి శుభ్రమైన ఉద్యోగాలు దయచేయిస్తున్నారు. ఢిల్లీ పరిపాలక వర్గం బాధ్యతా రహితంగా, సుస్థిరంగా ఉండబోతుంది. బాధ్యతలేని అధికారం ప్రమాదకరమైనది. ఏమైనా వ్యక్తి ఆరాధన లాభసాటి వ్యాపారమే!

కాంగ్రెసు బాగుపడాలంటే ఢిల్లీ మీద ముఖ్యంగా కాంగ్రెసు మీద విరక్తి ప్రాబల్యానికి కారణాలేమిటో విచారణ చేయించాలి అసలు ఢిల్లీలో కాంగ్రెసు ఎందుకు వేళ్లూని సుస్థిరం కాలేదో గ్రహించాలి.

కాంగ్రెసు ఉద్యమ ప్రారంభ దినాల నుండీ ఢిల్లీకి ఏకైక ప్రతినిధులుగా చెలామణీ అయిన కీ॥ శే॥ హకీం అజ్మల్ ఖాన్, కీ॥ శే॥ అసఫ్ అలీ, రాధారమన్ ఢిల్లీ కాంగ్రెసు నాయకత్వం వహించారు. శ్రీ శంకర్లాల్ కర్నాల్ నుండి, లాలా దేశబంధు పానిపట్ నుండి, ప్రొఫెసర్ ఇందర్ జలంధర్ నుండి, కృష్ణనాయర్ మలబార్ నుండి, శ్రీమతి సుభద్రాజోషీ పంజాబ్ నుండి కాందిశీకులుగా వచ్చారు. ఢిల్లీ రాష్ట్రపు ముగ్గురు మంత్రుల్లో ముఖ్యమంత్రి, మరొక మంత్రి ఢిల్లీవారు కానేకారు. ఢిల్లీ శాసనసభ స్పీకరు డా॥ సుశీలానయ్యార్ లేడీ హార్డింజ్ మెడికల్ కాలేజీలో చదివినంత మాత్రాన ఆమె ఢిల్లీ మనిషైపోతుందా? వీరందరూ కాంగ్రెసు అండ చూసుకుని ఢిల్లీ పాలకులై కూర్చున్నారు. కాంగ్రెసు అండ లేకపోతే ఎన్నికలలో వీరు డిపాజిట్ కూడా పోగొట్టుకుంటారు.

భారత పౌరులకు ఆస్తి హక్కులు లేని కాశ్మీర్ నుండి విజయం చేసిన వ్యక్తి ముష్తాక్ అహ్మద్ సోషలిస్టు నాయకుడు.

ఢిల్లీ ప్రజలకు ప్రాతినిధ్యం వహించే మహామహులు ఇటువంటివారు. వీరికి ప్రజాస్వామ్యంలో చిన్నమెత్తు నమ్మకం లేకపోయినా ఆ మాట పట్టుకుని ఊరేగుతారు.

ఎందుకంటే ఆ మాటమీద ప్రధానమంత్రికి ఎక్కడలేని మోజు. వీరికే గనక నిజంగా ప్రజాస్వామ్యంలో నమ్మకముంటే కాంగ్రెసు నాయకత్వం వహించడానికి, పదవులు స్వీకరించడానికి ఢిల్లీ పౌరులనే తీసుకొని వుండేవారు. ఇప్పటి పరిస్థితి ఎలా ఉందయా అంటే, అంతర్జాతీయ కార్మిక సమావేశాల్లో భారతీయ కార్మికులకు సర్ ఆంద్రూ క్లౌ ప్రాతినిధ్యం వహించినట్లు ఉంది. ఈ "సర్ ఆంద్రూలు," "లేడీకాలు" ప్రజాస్వామ్యాన్ని గూర్చి, ఢిల్లీ ప్రజలకు కొత్త పరిపాలనా వ్యవస్థ ఏర్పాటు చేయడం వల్ల వచ్చే నష్టాల్ని గూర్చి మాట్లాడక ఏం చేస్తారు? అత్యల్ప సంఖ్యాకుల చేతిలో అత్యధిక సంఖ్యాకులు యింతగా మోసపోయిన ఉదాహరణ మరొకటి లేదు. ★



# రెండో అంకం తరువాయి

మాతృక: ఫ్రెడరిక్ నాట్
అనుసరణ: ప్రఖ్యా శ్రీరామమూర్తి

[మళ్లీ లైట్లు ఫేడిన్ అవుతాయి. ఈలోగా సుమారు రెండుగంటలు గడిచాయి. పద్మ (పెస్‌కటింగ్స్ అన్నీ ఆల్బంలో అతికించడం పూర్తి అయిపోయింది. ఆల్బం టేబిలు మీదనే తెరిచివుంది. దాని పక్కనే కొన్ని న్యూస్ పేపరు ముక్కలు, కత్తెర, పడివున్నాయి. టేబులు కింద వేస్ట్‌పేపరుబుట్ట కూడా న్యూస్ పేపర్ కత్తిరింపులతో నిండిపోయి వుంది. పద్మ హాండ్‌బ్యాగ్ ఇంకా టేబులు మీదనే వుంది

లైట్లు ఫేడిన్ అయ్యేసరికి (తెర లేచి వుంది.) హాలులో ఓపక్క గోడకు తగిలించి వున్న జీరోవాట్ (ట్రాన్స్‌ఫర్మర్ బల్బు మాత్రం వెలుగుతూంటుంది కొద్ది సెకనుల అవకాశంతో హాలుతలుపు తాళం చెవి చాలా నెమ్మదిగా తిప్పిన శబ్దం- తలుపు నెమ్మదిగా రెండంగుళాలమేర మటుకు తెరుచుకుంటుంది. ఎవరో పొంచి వింటున్నట్టు- మరో నాలుగు సెకనుల తర్వాత తలుపు ఇంకా తోసుకుని గజపతి ప్రవేశిస్తాడు. గుమ్మంలోనే నిశ్చలంగా నిలబడి మరికొంచెం సేపు చెవియొగ్గి వింటాడు. రెయిన్‌కోటు, చేతులకి గ్లోవ్స్ వేసుకుని ఉన్నాడు తాళంపవేటప్పటి క్లిక్ తప్ప మరేం చడీ చప్పుడూ లేకుండా తలుపువేస్తాడు. హాలు మధ్యలోకివస్తూ మెడలోని సిల్కు నెక్‌టై తీసి కొంచెం ఎడం ఎడంగా రెండుముళ్లు వేస్తాడు.

గజపతి తోటవాకిలికేసి పోతూండగా టెలిఫోను మోగుతుంది. గబగబా ముందుకు పోయి తోటవాకిలి తెరలవెనక దాక్కుంటాడు. టెలిఫోను మళ్లీ మోగుతూండగా పడకగదిలో లైటు వెలుగుతుంది. మరో క్షణంలో పద్మ ఆ గది తలుపు తెరుచుకుని నిద్ర కళ్లతో బద్ధకంగా హాల్లోకి వస్తుంది. బల్ల ఆ చివరకు వెళ్లి తోట గుమ్మానికి వెన్నిచ్చి నుంచుని రిసీవరు తీసుకుంటుంది]

పద్మ: హలో... (రెండు సెకండ్లు ఆగి ఇంకొంచెం బిగ్గరగా) హల్లో!

[తెరల్లోంచి నెమ్మదిగా ఇవతలకు వచ్చిన గజపతిని పద్మ గమనించలేదు నెక్‌టై రెండు చివర్లూ రెండుచేతుల్తో పట్టుకుని వున్నాడు. పద్మ ఎడంచేత్తో రిసీవరు పట్టుకునివుంది. కుడిచేత్తో ఫోనుమీద నొక్కుతుండగా గజపతి నెక్‌టైని ఆమె తలమీదగా విసిరి కంఠానికి తగిలించి తనవైపు లాక్కుంటాడు. గొంతులోనే అణగారిపోయిన మూలుగుతో పద్మ చేతిలోని రిసీవరు వదిలేస్తుంది. గజపతి ఆమెను తనదగ్గరకు లాక్కుని తన వక్షస్థలంమీద ఆమె వీపు ఆన్చి గట్టిగా నెక్‌టై బిగించి పీకనొక్కుతూంటాడు. పద్మ నెక్‌టై పట్టుకుని పీకి అవతల పారెయ్యడానికి ఊపిరి తిరగని ప్రయత్నం చేస్తోంది. ఇద్దరూ ఒక్కక్షణం పెనుగులాడుకుంటారు. గజపతి ఎడమచేత్తో నెక్‌టైని ఆమె మెడమీదనుంచి చుట్టుతూండగా పద్మ హఠాత్తుగా అతనికభిముఖంగా తిరిగిపోతుంది. గజపతి ఆమెను వెనక్కు నెట్టుకుంటూపోయి టేబులుమీద ఆ చివరకు తోసి ఆమె తల టేబులుమీద ఆనించి నొక్కి నెక్‌టై బిగిస్తూంటాడు. పద్మముఖం వికృతంగా సంకుచిస్తూ (పేతుకులకు తల్లక్రిందులుగా కనిపిస్తుంది. నెక్‌టై గట్టిగాలాగి బిగించే ప్రయత్నంలో గజపతి బాగా ఆమెమీదకు వాలిపోయి వుంటాడు. పద్మ గిలగిల్లాడిపోతుంది. ఆమె చేతులు అటూ యిటూ కొట్టుకోవడంలో కుడిచెయ్యి టేబులుమీద వున్న కత్తెరమీద పడుతుంది. వెంటనే పద్మ కత్తెర అందుకుని కొనతో గజపతి వీపులో ఒక్కపోటు పొడుస్తుంది. గజపతి దుర్బలంగా ఆమెమీదపడి నెమ్మదిగా టేబులు ఆ చివరకు దొర్లి నేలకు జారి భయంకరంగా మూలిగి వెల్లకిలా పడిపోతాడు. పద్మవంట్లో సత్తువ అంతా ఉడిగిపోయి మరోక్షణం సేపు అల్లానే టేబులుమీద పడిపోయి వుంటుంది. తర్వాత ఎలాగో లేచి వూపిరికోసం కొట్టుకులాడుతూ పడిపోకుండా నిలదొక్కుకుంటుంది మెడకి చుట్టుకుపోయిన నెక్‌టై లాగి పారేస్తుంది, గాని అది ఆమె భుజాల మీదనుంచి వ్రేలాడుతూంటుంది. వెంటనే టెలిఫోను అందుకుని ఏదో మాట్లాడబోతుంది, గాని గొంతు పెగలక మాటలు సరిగారావు]

[రిసీవరులోంచి తీవ్రంగా 'హలో' అని ఫణి గొంతు వినిపిస్తుంది.]

ఫణి: హలో!

పద్మ: పోలీస్ - త్వరగా, పోలీస్ స్టేషను కావాలి—

ఫణి: పద్మా!

పద్మ: ఎవ్వరు? - ఎవరు మాట్లాడేది?

ఫణి: పద్మా! నేను - నేను పద్మా - ఫణిని!

పద్మ: హమ్మ! మీరా! ఏమండీ - త్వరగా రాండీ

ఫణి: ఏమిటి? ఏమైంది?

పద్మ: (మళ్ళీ భయం ముంచెత్తుకొచ్చి వణికిపోతూ) నేనిప్పుడు చెప్పలేను - తొందరగా ఇంటికి వచ్చెయ్యండీ - ప్లీజ్.

ఫణి: (చిరాకేసి) ఏమిటే ఆ గొడవ? సంగతేమిటో చెప్పరాదూ?

పద్మ: ఎవడోనండీ - ఎవడో నామీద పడి నా పీక నులిమెయ్యబోయాడు—

ఫణి: పారిపోయాడా?

పద్మ: లేదు - చచ్చిపోయాడు-వాడు చచ్చిపోయి వున్నాడు ... ఏమండీ

 ఫణి 

ఏమండీ - వున్నారా లేరా అక్కడ మీరు?...

ఫణి : (విభ్రాంతుడై) పద్మా!?

పద్మ : ఊఁ—

ఫణి : నే చెప్పేది జాగ్రత్తగా విను—

పద్మ : చెప్పండి—

ఫణి : నీ చేత్తో నువ్వేదీ ముట్టుకోవద్దు. ఒక్క నిముషంలో వచ్చేస్తాను. ఏదీకూడా తాకవద్దు. తెలిసిందా?

పద్మ : సరే.

ఫణి : ఏం ముట్టుకోవద్దు - ఎవర్నీ పిలవొద్దు - ఎవళ్లతోనూ ఏం మాట్లాడొద్దు.

పద్మ : సరే - మీరుమటుకు—

ఫణి : ఎవర్నీ కేకెయ్యవుగా?

పద్మ : (భయం - కోపం) సరే నండి బాబూ - ముందు మీ రొచ్చెయ్యండీ

[రిసీవరు ఫోనుమీద పెట్టేస్తూండగా మళ్ళీ పద్మకు కంపం పుట్టుకొచ్చి ఏడుస్తుంది. తూలుతూపోయి తోటవాకిలి తలుపులు బోల్టగాతోసి అవతలకు వెళ్తుంది. కొద్ది క్షణాల్లో తిరిగి వచ్చేసరికి ఆమె భుజాలమీద చెక్ రైట వుంటుంది. హాలులో పడివున్న శవాన్ని చూడంగానే హాలు వాకిలి కేసి పరుగెత్తిపోయి, ఆగి, సోఫాలో కూలబడి మళ్ళీ వెక్కి వెక్కి ఏడుస్తుంది. అంతలో నే లేచి పడకగదిలోకి పరుగెత్తుకు వెళ్ళి తలుపు వేసేసుకుంటుంది. కొద్దిక్షణాల అవకాశం...

ఎక్కడో చర్చిలో కొడుతున్న గంటలు వినిపిస్తాయి...మళ్ళీ కొద్ది క్షణాల అవకాశం...

బైట వీధిగేటు దబాల్న తెరుచుకున్న కీలు చప్పుడు - వరండాలో పరుగెత్తుకొస్తున్న అడుగుల చప్పుడు - తాళంలో చెవిపెట్టి తిప్పిన శబ్దం-హాలుతలుపు తెరుచుకుంటుంది. ఫణి లోపలికొచ్చి గోడ బ్రాకెట్ లైట్ వేసి హాలంతా కలయజూస్తాడు. నేలమీద పడివున్న శవంకేసి-టేబులుమీద హాండ్ బ్యాగ్ కేసి-మళ్ళీ శవంకేసి చూస్తాడు. తలుపుకు వున్న తాళంచెవి తీసి తన షేర్వాణీజేబులో వేసుకుంటాడు. నెమ్మదిగా తలుపు మూసేసి రెండో బ్రాకెట్ లైట్ కూడా వేస్తాడు. గజపతిని సమీపించి ఎలా చచ్చిపోయాడా అని పరిశీలించి చూస్తూ శవాన్ని కొద్దిగా దొర్లిస్తాడు. వీపుమీద బాగా దిగబడిపోయిన కత్తెర కనిపిస్తుంది. తన చేతులకేమైనా రక్తం అయిందేమో చూచుకుని పడకగదికేసిచూసి, గజపతి జేబులు వెదుకుతాడు తాళం చెవికోసం. కాని అది దొరకదు. పడకగదిలో చప్పుడు-ఫణి లేచి నిలబడతాడు. పడకగది తలుపులు తెరిచి పద్మ అతన్ని చూసి పరుగెత్తుకుంటూవచ్చి అతన్ని కావిలించుకుని ఏడుస్తుంది]

ఫణి : (ఆమెని సముదాయిస్తూ) మరేం ఫరవాలేదు-నే వచ్చాగా - వూరుకో... వూరుకోమరి...ఏం జరిగిందసలు?

[భయపడ్డ పసిపిల్లలా పద్మ అతన్ని ఇంకా గట్టిగా కౌగలించుకుంటుంది. ఆమె ముఖం కనిపించేట్లు ఫణి గడ్డం పట్టుకు కొద్దిగా ఎత్తుతాడు]

పద్మ : నా మెడచుట్టూ ఏదో చుట్టాడు...రిబ్బనులా-సన్నగా—

ఫణి : రిబ్బనా?...ఏదీ నన్ను చూడనీ- ఆమె కంఠం పట్టుకుచూస్తాడు. పద్మ బాధతో ముఖం అటు తిప్పుకుంటుంది]

డాక్టర్ని పిలవనా?

పద్మ : (అంటానికూడా భయమేసి) వాడు.... వాడు-చచ్చిపోయాడండీ:—

ఫణి : (శవంకేసిచూసి) అవును. కింద పడినప్పుడు కత్తెర బాగా దిగబడిపోయి వుంటుంది.

[పద్మ చూడలేక గభాల్న అటు తిరిగి మొహం చేతుల్లో కప్పుకుని వెక్కివెక్కి యేడుస్తుంది.]

ఇప్పుడే వస్తానుండు పద్మా!

[గబగబా పడకగదిలోకి వెళ్తాడు. పద్మ చేతుల్లో తలపట్టుకు ఒత్తుకుంటుంది. కళ్ళు తుడుచుకుని ఇటు తిరిగి హాలంతా కలయజూసి టేబులుమీదవున్న హాండ్ బ్యాగ్ చూసి అందుకుని తెరిచి దేనికోసమో వెతుకుతూంటుంది.

ఫణి పడకగదిలోంచి దుప్పటీ ఒకటి తీసుకుని హాల్లోకివచ్చి పద్మ చేస్తున్న పని చూసి ఖటిక్కిన ఆగిపోతాడు.]

ఏమిటది? ఏమిటి వెదుకుతున్నావ్?

పద్మ : (ఆస్పిరిన్ బిళ్ళ బైటికితీసి) తల బద్దలు కొట్టుకుపోతోంది-కాసినినీళ్లు తెచ్చిపెట్టండి.

[హాండ్ బ్యాగ్ మళ్ళీ టేబులుమీద పడేస్తుంది. ఫణి వంటయింట్లోంచి గ్లాసుతో నీళ్ళు తెచ్చియిస్తాడు. పద్మ మాత్ర వేసుకుని నీళ్ళు తాగుతుంది. ఫణి తను తెచ్చిన దుప్పటీ గజపతిమీద కప్పుతాడు.]

పద్మ : ఆ తలుపు వేసెయ్యండి.

ఫణి : ఉఁహు-పోలీసు లొచ్చేదాకా మనం ఏమీ ముట్టుకో రాదు. (తెరిచివున్న తోట తలుపుల కేసిచూస్తూ) గడియ బద్దలుకొట్టుకువచ్చి వుండాలి! (హాలంతా ఓసారి కలయజూసి) ఏం ఎత్తుకు పోదామని వచ్చాడో! (వెండి కప్పులు, షీల్డుల వంక చూసి) వాటికోసమై వుంటుంది!

పద్మ : పోలీసు లెప్పుడొస్తారు?

ఫణి : (ఉలిక్కిపడి) పిలిచావా వాళ్లి నప్పుడే?

పద్మ : లేండి ఎవర్నీ పిలవొద్దన్నారుగా మీరు వెంటనే పిలవడం మంచిదేమో.

ఫణి అవును వెంటనే పిలుస్తాను.

పద్మ : వాళ్ళొచ్చి అడిగితే ఏంచెప్పాలో ఎలా చెప్పాలో.. . .

ఫణి ఇప్పుడేం చెప్పక్కర్లేదు. నువ్వు ముందు కొంచెం నిద్రపోవాలి. వాళ్ళకి కావాల్సిందంతా నే చెప్తాలే

పద్మ : అది కాదూ—

ఫణి ఏదీకాదు పద్మా—ముందు నువ్వు కాస్సేపు నిద్రపో. ఈ గొడవంతా కాస్సేపు మర్చిపో.. ఊఁ—పద—

[పడకగదికేసి పద్మని మెల్లిగా నెట్టుతాడు. పద్మ గుమ్మం దాకా వెళ్లి వెనక్కి తిరుగుతుంది ]

పద్మ : అవునూ—

ఫణి . ఏమిటి ?

పద్మ మీ రెండుకు నా కిందాక ఫోన్ చేశారు ?

[ఫణి తెల్లబోయి జవాబు చెప్పేముందు ఆమెకేసి కనీసం మూడు సెకనుల సేపు చూస్తాడు ]

ఫణి . ఆఁ...? ఆఁ.. సారీ—తర్వాత చెప్తాలేగాని ఆసంగతి—(విషయం మారుస్తూ) వాడు — ఏమిటీ — రిబ్బనా నీ మెడచుట్టూ బిగించాడన్నావ్—?

పద్మ : రిబ్బనే అయివుండాలి—లేకపోతే అలాంటిదే ఏ గుడ్డపీలికో మరి—ఇక్కడ లేదూ అది ?

ఫణి : (చుట్టూచూస్తూ) లేదు.. ఏవో కనిపించక ఎక్కడికి పోతుందిలే ఊఁ ఇహ నువ్వెళ్లి పడుకో. నేను పోలీసులకి ఫోను చేస్తాను.

[పద్మ లోపలకు వెళ్లి తలుపు వేసుకుంటుంది ఫణి గజపతి దగ్గరకు వెళ్లి, దుప్పటి తొలగించి, మళ్లీ తాళం చెవికోసం జేబులు వెదుకుతాడు చివరికో జేబులో అది దొరుకుతుంది. అదితీసి పెద్దభారం దిగినట్టు నిట్టూర్చి టేబులుమీదహాండ్ బ్యాగ్ లోంచిజిప్ పర్స్ తీసి అందులో ఆ తాళం చెవి (తుడిచి) జాగ్రత్తగా పెట్టి హాండ్ బ్యాగ్ మూసి మళ్లీ టేబులుమీద పెడతాడు మళ్లీ శవం దగ్గరకు వచ్చి మోకరిల్లి తనజేబులోంచి పెద్ద పర్సు తీసి అందులోంచి, చేతిగుడ్డ అడ్డం పెట్టుకుని, (శంకరం పద్మకు రాసిన) ఉత్తరం తీసి గజపతి జేబులోదోపి, దుప్పటి శవంమీద కప్పేస్తాడు గది అంతా మళ్లీ ఓసారి కలయజూస్తాడు. చివరికి తోట గుమ్మం అవతలికి వెళ్తాడు వంగి, నేలమీద నుంచి ఏదో తీసి మళ్లీ గదిలోకి వస్తాడు. రెండు చేతులతో గజపతి నెక్ టై రెండు చివర్లూ పట్టుకుని వున్నాడు. ఆలోచనా పూర్వకంగా పద్మ అల్లిక దారాల బుట్ట దగ్గిరికి పోయి అందులో వెతికి రెండు



ఢిల్లీలో బిర్లా మందిరం

—ఫొటో : వి. కే. శర్మ

రిబ్బను తీసి టైతో పోల్చి చూస్తాడు చివరికి ఆ రిబ్బన్లు కలిపి నెక్ టైకి వున్నట్లే రెండు ముళ్లు వేసి టేబులు కింద పడేసి, టై తనజేబులో పెట్టుకుంటాడు. ఫణి ముఖం సంతృప్తితో పైశాచికంగా వికసిస్తుంది చిరునవ్వుతో మరోసారి హాలంతా పర్యాలోకించి పడకగదివైపు ఓసారిచూసి ఫోను రిసీవరు ఎత్తి నంబరు డయల్ చేస్తూంటాడు. ఇంతలో పద్మ పడకగది తలుపు తెరుచుకుని అక్కణ్ణుంచే అడుగుతుంది—]

పద్మ : శంకరం ఏడండీ ?

ఫణి . (ఉలిక్కిపడతాడు — అంతలోనే సర్దుకుని) ఆఁ ? ఓ అతన్ని వాళ్ల రూముకి వెళ్లి పొమ్మన్నాను. హలో— ఆపరేటర్ — ఆ—ఖైరతాబాద్ పోలీస్ స్టేషను కావాలి— త్వరగా...

పద్మ : అతనికి చెప్పారా ఈ సంగతి ?

ఫణి : లేదు—అస లేంజరిగిందో నాకు సరిగా తెలియందే అందుకని నాకు వంట్లో యేంబాగాలేదని చెప్పివచ్చేశాను...అబ్బాం నిన్ను కాస్సేపు విశ్రాంతి—

[పద్మ లోపలకువెళ్ళి తలుపువేసుకుంటుంది. రిసీవరులోంచి పోలీసు కంఠస్వరం వినిపిస్తుంది—]

పోలీస్ : ఖైరతాబాద్ పోలీస్ స్టేషన్

ఫణి . పోలీస్ ? ఇక్కడ చాలా దారుణమైన సంఘటన ఒకటి జరిగిందండీ...

[లైట్లు ఫేడౌట్]

* * *

[లైట్లు ఫేడిన్ అవుతాయి]

(శుక్రవారం ఉదయం—సుమారు 10 గంటల సమయం. తెరలుపక్కలకు లాగివున్నాయి. బైట ఎండకాస్తోంది వేస్టుపేపరు బుట్ట ఖాళీచేయబడింది గజపతి శవాన్ని తీసుకు వెళ్లిపోయారుగాని అతన్ని కప్పిన దుప్పటి సగానికి మడతపెట్టి అతను పడిన స్థలంలో రక్తపుమరకల్ని కప్పివుంచడంకోసం పడేసి

★ ఫణి ★

వుంచబడింది. టేబులుమీద కాఫీ కప్పూ, సాసరు వున్నాయి.

తెర లేచేసరికి పద్మ సోఫాలో కూలబడి వుంటుంది. రాత్రంతా నిద్రలేనట్లుంది - మనిషి సగమైపోయినట్లు కనిపిస్తోంది.

ఫణి నెక్‌టై కట్టుకుంటూ పడకగది లోంచి వస్తాడు.)

ఫణి : చూశావా - ఆ కాఫీ ఇంకా అలాగే వుంచేశావ్ - తాగు పద్మా.

పద్మ : నా కొద్దండీ

[ఫణి కాస్త విసుగుతో ఆమె వంక చూస్తాడు.]

ఫణి : నువ్వా గొడవ మర్చిపోవాలి పద్మా అనవసరంగా బాధపడి ఏం ప్రయోజనం?

పద్మ : ఎంత పోద్దామనుకున్నా కళ్లకు కట్టి నట్టుంది! అబ్బ - ఎంత దారుణం - తలుచుకుంటే కళ్లు తిరిగిపోతున్నాయి.

ఫణి : ఇంకా నయం - ఆ సార్జెంటన్నట్టు పక్కన కత్తెర లేకపోతే శాశ్వతంగా కన్ను మూసేదానివి!

పద్మ : ఈ హత్యాపాతకం కంటే అదే మేలనిపిస్తోంది!

ఫణి : ష్ పద్మా—!

పద్మ : నే నీవేదన భరించలేనండీ,

ఫణి : ఏం ఫరవాలేదు పద్మా నువ్వు చేసినదాంట్లో లా ప్రకారం కూడా ఏం తప్పులేదు - ఆత్మరక్షణకోసం చెయ్యాల్సి వచ్చింది. అంతే! రాత్రి పోలీసులు కూడా నీ ధైర్యానికి. సమయస్ఫూర్తికి ఎంత మెచ్చుకున్నారనుకున్నావ్!

పద్మ : ఇంకేమన్నారు వాళ్లు?

ఫణి : ఏం ఉంది అంటానికి - ఇలా వాకిలీ అంతా తిప్పి చూపించాను ఇహ మీ అవసరం ఏం వుండదు. మీరెళ్లి పడుకోండి. మాకు చాలా పనివుంటుందన్నారు. అన్నదే చాలని నేనూ వెళ్ళిపడుకున్నాను.

పద్మ : అవును మీకు బాగానే నిద్ర పట్టింది... [ఒక్క క్షణం నిశ్శబ్దం]

ఫణి : అన్నట్టు పద్మా యీ—

పద్మ : అసలు రాత్రి మీరు—

[ఇద్దరూ ఒక్కసారిగా]

ఫణి : ఏమిటి?

పద్మ : మీ రేమిటి చెప్పబోయారు?

ఫణి : ఏంలేదు—మళ్ళీ నే మర్చిపోతా నేమో నువ్వు పోలీసుల్ని వెంటనే ఎందుకు పిలవలేదని అడిగాడు రాత్రి సార్జెంటు.

పద్మ : ఎలా? మీరున్నారాయే ఫోను మీద—!

ఫణి : అదే—నేను ఫోను చేస్తాననుకుని నువ్వు చెయ్యలేదని చెప్పాను.

పద్మ : అసలు మీ రొచ్చేదాకా ఎవరి తోనూ మాట్లాడవద్దని మీరు చెప్పారుగదండీ!

ఫణి: అవును. నీ కంగారు విని నాకూ కంగారెత్తింది. అసలు నువ్వేం మాట్లాడుతున్నావో నాకర్థం కాలేదు. అందుకని ఇక్కడకొచ్చి సంగతేమిటో తెలుసుకుని ఫోను చేద్దామనుకున్నాను

పద్మ: ఆమాటే చెప్పొచ్చుగా వాళ్లకి.

ఫణి: చెప్పాలే. నేనలాగే చెప్పాను. జరిగిందే అంతగదా అసలు!

[తలుపు తట్టిన చప్పుడు]

ఆ వచ్చింది శంకరం అనుకుంటాను. తలుపుతియ్యి పద్మా, నే నిప్పుడే వస్తాను.

[అంటూ పడకగదిలోకి వెళ్తాడు. పద్మ లేచి వెళ్ళి హాలు తలుపు తెరుస్తుంది.

డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ జాఫర్ బైట నిలబడివున్నాడు.]

జాఫర్: (టోపీతీస్తూ) నమస్తే శ్రీమతీజీ!

పద్మ: (గుండెలు ఒక్కసారి నోట్లోకి వస్తాయి) ఓహ్ నమస్తే.

జా: పద్మావతీదేవిగారు మీరేననుకుంటాను.

పద్మ: ఆఁ...అవును...

జా: నేను డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ని —

పద్మ: లోపలకు రండీ...(గాభరాగా) వారితో చెప్తాను మీరొచ్చారని...

జా: జీ.

[పద్మ పడకగదిలోకి వెళ్తుంది. ఇన్‌స్పెక్టరు టోపీ ఎక్కడ తగిలిద్దామా అని చుట్టూ చూసి కోట్‌రాక్‌కు తగిలిస్తాడు. హాలు మధ్య దాకా వచ్చి చుట్టూ కలయజూస్తాడు. దుప్పటి, కిటికీ, టెలిఫోను పడకగది గుమ్మం ఒకదాని తర్వాత ఒకటిగా అన్నిటివంకా తీక్షణంగా చూస్తాడు కాసేపు. మళ్ళీ గది అంతా కలయజూస్తాడు ఈసారి పద్మ అల్లికదారాల బుట్టమీద పడుతుంది అతని దృష్టి. పడకగదిలోంచి ఫణి, పద్మ వస్తారు ]

ఫణి: గుడ్‌మార్నింగ్

జా: గుడ్‌మార్నింగ్ సార్. నేను ఈ డివిజను సి. ఐ. డి ఇన్‌స్పెక్టర్ని. నాపేరు జాఫర్. రాత్రి ఇక్కడికు వచ్చాగాని నే వచ్చేసరికి మీరు నిద్రపోయారు.

ఫణి: ఓ-అలాగా. కాని.. మా రిపోర్టంతా రాత్రే మీ సార్జెంటుకిచ్చేశాం...

జా: ఆ - అవును. అతని రిపోర్టు కూడా నేను చూశాననుకోండి. ఐనా కొన్ని విషయాలు సరాసరి మీనుంచి తెలుసుకోవాలని వచ్చాను. మా సార్జెంటు మీతో ఆట్టేసేపు మాట్లాడలేదు. (గబుక్కున పద్మవైపు తిరిగి) కదండీ?

పద్మ: అవును... నేను...

ఫణి: రాత్రంతా ఆషాక్‌తో చాలా బాధపడిందిలెండి

జా: అవును పాపం very nasty shock.

[పద్మ ఇప్పుడు చాలా కంగారుగా వుంది. నేలమీదపడివున్న దుప్పటీ వైపు తిరిగి దానివంక ఓక్షణం చూస్తుంది. తర్వాత నెమ్మదిగా సోఫా దగ్గరకు వెళ్లి అందులో కూర్చుని కణతలు ఒత్తుకుంటుంది ]

ఫణి: అసలు వాడు రాత్రి ఇంట్లోకి ఎలా ప్రవేశించాడో ఏమిటో మాకేం అంతుపట్టకుండా వుందండీ.

జా: ఊఁ...అసలు సమయానికి మీరిక్కడ లేరటగా!

ఫణి: అవును. నేషనల్ థియేటర్‌లో నాటకం ఒకటుంటేనూ అది చూడటానికి వెళ్ళాం నేనూ ఇంకో ఫ్రెండూనూ

జా: ఇక్కడికి దగ్గిరేకదూ నేషనల్ థియేటర్?

ఫణి: అదే దగ్గర-రెండుఫర్లాంగులు పైనే వుంటుంది. తమాషా చూడండి-సరిగా అప్పుడే పద్మకి నేను ఫోను చేస్తున్నా!

జా అవునట అప్పుడు టైంఎంతయిందో?

ఫణి: అప్పుడా...?...సారీ నే చెప్పలేను

జా: మీరేమైనా చెప్పగలరా?

పద్మ: ఊ హు-

జా: (ఫణితో) మీరు పోలీస్ స్టేషనుకు రిపోర్టు చేసినప్పుడు సరిగా 11-13 అయింది.

ఫణి: ఓహో...ఐతే...అంతకుముందే-పదినిముషాలు-పావుగంట క్రితం జరిగి వుండొచ్చు. అన్నట్టు-నిలబడేవున్నారేం? కూర్చోండీ

[ఇన్స్పెక్టరు సోఫాలో కూర్చుంటాడు. ఫణి, పద్మ తమకుదగ్గరగావున్న కుర్చీల్లో-ఇన్స్పెక్టరుకి ఇద్దరు చెరో పక్కగా-కూర్చుంటారు ]

జా: (కూర్చుంటూ) థాంక్స్.

ఫణి: వాడెవడో ఏమైనా తెలిసిందా?

జా: అతనిబస, అదీ కనుక్కున్నాం కాని అతనిపేరులోనే చాలా గందరగోళంగావుంది చాలా పేర్లు వున్నట్టున్నాయి మనిషికి. (హఠాత్తుగా పద్మవైపు తిరిగి) మీరతన్ని అంతకుముందెప్పుడైనా యెరుగుదురా?

పద్మ: (అయోమయమై) ఆ? అఁహఁ లేదు-

[ఇన్‌స్పెక్టరు జేబులోంచి నోటుబుక్కు తీసి అందులోంచి రెండు వేర్వేరుసైజుల ఫోటోలతీసి ఆమెకు ఒకదానితర్వాతఒకటి అందిస్తాడు. ఆమె చూసి అతనికి తిరిగి ఇచ్చేస్తున్నంతసేపూ ఇన్‌స్పెక్టరు ఆమెవంకే పరిశీలనగా చూస్తుంటాడు.]

ఇతనే...అతనా?

జా: అవును. గుర్తుపట్టారా అతన్ని?

పద్మ: లేదు. అసలు అతన్ని నేనెప్పుడూ చూసి యెరగను!

జా: రాత్రి?

పద్మ: ఊ హు. అసలతను వెనకపాటుగా వచ్చి కలియబడ్డాడు. అదీగాక గది చీకటిగా వుంది. అసలు నాకు కనిపించనేలేదతను!

  

# ఫణి

జా : (మర్యాదగా నవ్వుతూ) మొదట్లో మీరు అతన్నెప్పుడూ చూడలేదన్నారు. మరి - రాత్రికూడా అతన్ని చూసే వుండక పోతే అంతకు ముందు అతన్ని చూసిందీ లేందీ ఎలా చెప్పగలరు?

పద్మ : (గంద్రగోళపడి) నాకేం అర్థం కావటంలేదు...

జా : (నవ్వుతూ) పోనీలెండి ఫరవా లేదు. (ఫణితో) పోనీ మీ రెప్పుడైనా చూశారా అతన్ని?

ఫణి : లేదుసార్...

[ఇన్స్పెక్టర్ ఫణికి ఒక ఫోటోగ్రాఫ్ అందిస్తాడు ]

(చూచి తిరిగి ఇచ్చేస్తూ) ఉహుఁ.

[ఇన్స్పెక్టరు మరొకటి అందిస్తాడు. అది కూడా చూచి—]

నోసార్. (తిరిగి ఇవ్వబోతూ అంతలోనే వెనక్కు లాక్కుని ఇంకోసారి పరిశీలనగా చూసి) అ...

జా ! యస్?

ఫణి : (ఆశ్చర్యపడి) అరె - మా కాలేజీ మేట్ ఒకడు అచ్చు ఇలాగే వుంటా డండీ!...కాని నే నెరిగిన నితనికి మీసం వుండేది కాదు మరి....

జా : అతని పేరేమిటి?

ఫణి : (ఆలోచించి) సారీ, సార్... ఇప్పటి సంగతా? నేను కాలేజీ మానేసే పదిహేనేళ్ళయింది.

జా : అతని పేరు గజపతా?

ఫణి : నో.

జా : బాబూ రావా?

ఫణి : ఉహుఁ—

జా : పోనీ...రవీంద్రం కావచ్చునా?

ఫణి : ఉహుఁ - ఆఁ? రవీంద్రమా? ఉండండి...రవీంద్రం...యస్. దట్సైట్.

[గోడకి తగిలించివున్న ఫోటో ఇన్స్పెక్టరు దగ్గరకు తీసుకొస్తాడు]

ఇదిగో చూడండి, మా ఫస్ ఓల్డ్ బాయిస్ మీటింగ్ నాడు తీయించుకున్న ఫోటో యిది. ఇదుగో!...అరె ఆశ్చర్యం ఇతనే-

జా : అతన్ని మీరు బాగా యెరుగుదురా?

ఫణి : లేదు - నా కంటే సీనియరు.

జా : అప్పట్నుంచీ ఎప్పుడైనా కలుసుకున్నారా అతన్ని?

ఫణి. ఉహూఁ...ఆఁ - ఆ మాటంటే జ్ఞాపక మొస్తోంది...కలుసు కోవటమంటూ లేదుగాని - ఆ మధ్యనోసారి చూశాను - దూరంనుంచి. అంతే.

జా : ఎప్పుడది?

ఫణి. అవుతుం దోయేడాది, ఏదో రైల్వే స్టేషనులో నండీ...కావిరుడా?... ఆఁ - అక్కడే. చాలాకొత్తగాకనిపించాడు గాని కొంచెంపాగి మళ్ళీ అటు తిరిగి చూసేసరికి లేడు.

[ఒక్క క్షణం అవకాశం. ఇన్స్పెక్టరు లేస్తూ పద్మవైపు తిరిగి అంటాడు—]

జా : సరే - రాత్రి సరిగ్గా ఏం జరిగిందో ఓసారి చూపిస్తారా?

[పద్మ భిరుకంక చూస్తుంది]

ఫణి : చూపించు పద్మా, పోలీసులకి మనం చేతనైనంత సాయంచేసి తీరాలి.

[పద్మను చెయ్యిపట్టుకు లేవదీస్తాడు. పద్మ మాట్లాడుతూ పడకగది దగ్గరకు, మళ్ళీ ఫోను దగ్గరకు, ఫోను వెనక్కి నడిచి చూపుతుంది.]

పద్మ : ఫోను మోగేసరికి నే పడుకుని వున్నాను. వెంటనే లేచి ఇక్కడికి వచ్చాను.

జా : వచ్చి ఈ గదిలో లైటు వేశారా?

పద్మ : లేదు. ఆ గదిలో లైటు వేసుకున్నాను.

జా : సరిగ్గా మీ రెక్కడ నిలబడి వున్నారో చూపండి.

[పద్మ రాత్రిలాగే టేబులు వెనక్కి వచ్చి తలుపు వైపు సగంవీపు పెట్టి నిలబడుతుంది.]

పద్మ : ఇక్కడ నుంచుని రిసీవరు ఎత్తాను.

జా: తలుపువైపు వెన్నిచ్చి నిలబడ్డారా?

పద్మ: అవును.

జా: ఎందుకని?

పద్మ: ఎందుకనంటే - ?

[ఇన్స్పెక్టరు టేబిలుముందు తలుపుకి ఎదురుగా నిలబడతాడు]

జా: అఁహాఁ - అలా చుట్టుతిరిగి ఎందుక వెళ్ళాలి. మామూలుగా సరాసరి ఇక్కడికొచ్చి ఫోను తీసుకోవచ్చుగా!

[అంటూ కుడిచేత్తో రిసీవరుయెత్తి మళ్ళీ దించుతాడు]

ఫణి: మీర నేదాంట్లో అర్థం లేకపోలేదు గాని - రాత్రి ఆమె ఎలా నుంచున్నదీ ఆమెకి తెలీదంటారా?

జా: మీరు ఒక్క క్షణం ఆగండి, ప్లీజ్ !

పద్మ: నేనెప్పుడూ ఇక్కడ నుంచునే ఫోను అన్సరు చేస్తాను.

జా: ఎందుకని?

పద్మ: ఏదైనా మెస్సేజ్ తీసుకోవాల్సి వస్తే ఇలా ఎడంచేత్తో ఫోను పట్టుకుని కుడిచేత్తో రాసుకోవచ్చుగనక! నా కదో అలవాటు!

జా: ఐసీ. ఆల్ రైట్. తరవాత?

—ఇంకా ఉంది

# ★ కీర్తి తెరల మాటున ★

రాధ వుత్తరం వ్రాసుకుంటున్నదల్లా తలెత్తి చూసింది తన ఎదురుగా కూర్చున్నావిడ వంక. ఆవిడ ఏదో ఇంగ్లీషు మేగజైను శ్రద్ధగా చదువుతోంది. ఎక్కడో చూసిన మొహంలా వుందే, అనుకుంది రాధ. కానీ ఎంతసేపు ఆలోచించినా జ్ఞాపకం రాక, విసుగుపుట్టి మళ్లీ వుత్తరం వ్రాయడం మొదలెట్టింది చెవులు బద్దలయ్యేలా వినిపించిన 'కనేడిషన్ ఇంజన్' కూతకి వులిక్కి పడి, గడియారం చూసుకుంది రాధ.

నైజాంబండికి యింకా మూడున్నర గంటల వ్యవధి వుంది. రాధ ఎదురుగా కూర్చున్నావిడ ఎఱ్ఱగా, కుదిమట్టంగా వుంది. ఆవిడకూడా రాధవంక ఓమాటు చూసి తల వంచుకుని మేగజైను పఠనంలో నిమగ్నురాలైంది.

సెకండుక్లాసు వెయిటింగురూం అంతా గందరగోళంగా వుంది. ఈదురుగాలికి తలుపులు, లైట్లు అన్నీ కదులుతున్నాయి 'టప్' మని ఏదో పడిన చప్పుడికి రెండు టేబిలు ప్రక్కన కూర్చున యిద్దరూ తలెత్తిచూశారు. బల్లమీది పత్రిక ఒకటి గాలికిఎగిరి, యిద్దరికీ మధ్యగా పడింది. రాధ వంగబోయింది దాన్ని తీద్దామని కానీ ఆ రెండో ఆవిడ కూడా వంగడంవల్ల తాను లేచింది. ఆవిడ కూడా అదేసమయంలో రాధ తీస్తుందేమో అన్న ఉద్దేశ్యంతో చాచిన చెయ్యి వెనక్కి లాక్కుంది. ఇద్దరూ తీయలేదు మళ్లీ యిద్దరూ వంగారు. రాధ నవ్వింది ఆవిడ వంక చూసి ఆవిడా నవ్వింది. పత్రిక రాధే పైన పెట్టింది.

"ఎందాక" అన్న పలకరింపులతో ప్రారంభమైంది సంభాషణ. రాధ హైదరాబాదు వెళుతోంది. ఆ రెండో ఆవిడ కంచి కెడుతోంది మద్రాసు మెయిలు తప్పిపోవడంవల్ల, మర్నాటి ఎక్స్‌ప్రెస్ వరకూ వుండాలామె బెజవాడలో.

"మీముఖం ఎక్కడో చూసినట్లుగా వుందండీ." అన్నది రాధ ఆవిడతో.

ఆవిడనవ్వింది. "రేడియో పత్రికలో నా ఫోటో చూసివుండవచ్చు మీరు. నాపేరు మాలిని"

వెంటనే అవగతమైంది రాధకి. ఆ ప్రసిద్ధ గాయకురాలు మాలిని!

రాధ మనస్సు ఆనందంతో నిండింది. "మీరే కాదూ? ఔను. నాకు జ్ఞాపకముంది. మీపాటవిని, నేనెంతగానో మైమరచి పోతాను. ఎంత తియ్యనికంఠమండీ మీది!" అన్నది రాధ పట్టలేక. మాలిని నవ్వింది.

"మరి మీ సంగతి చెప్పారుకాదు!" అన్నది ఆమె రాధవంక పరీక్షగా చూస్తూ. రాధ సిగ్గుపడింది. కానీ వెంటనే బల్లమీద వున్న పత్రిక తీసి, కొన్ని పేజీలు తిప్పి, మాలిని ముందుంచింది "ఆ కథ వ్రాసింది నేనే" అన్నదామె

రాధాదేవి! మాలినికూడా చకితురాలైంది. ప్రసిద్ధ కథకురాలు రాధాదేవి యీవిడేనా? మాలిని రాధని ఎన్నివిధాలో అభినందించింది నిత్యం తను అభిమానంతో చదివే కథలన్నీ రాధవే అని తెలుసుకుని మాలిని ఎంతో ఆనందించింది - సాక్షాత్తు ఆవిడ పరిచయమే కలిగినందుకు.

ఇద్దరూ ఆనందంతో మాట్లాడుకోసాగారు. గాయకుల్ని గురించి, కథారచయితల్ని

ఎమ్. జానకిరాణి

గురించి, త్యాగరాజుని గురించి. విలియం షేక్స్పియరుని గురించి మాటాడారు వారు. ఇద్దరూ కలిసి వెళ్లి కాఫీ త్రాగి వచ్చారు రైల్వే కాంటీనులో.

వెయిటింగురూంకి తిరిగి వచ్చేస్తుంటే రాధ అన్నది. "నిజంగా యిది చాలాసుదినం మాలినిగారూ. ఇంత మధురగాయనిని నేను స్వయంగా కలుసుకుంటానని ఎన్నడూ అనుకోలేదు అతిశయోక్తి, ముఖస్తుతి కాదనుకుంటే నేనోమాట చెబుతాను. కోయిల కంఠంలోని మాధుర్యం స్ఫురిస్తుంది నాకు మీకంఠంలో."

మాలిని వెంటనే అన్నది, రాధచేతిని తన చేతులోకి తీసుకుని. "సరిగ్గా నేనూ అదే అనబోతున్నాను. ఇవాళ్లి నిజంగా సుదినం. మీలాంటి రచయిత్రిని కలుసుకోగలుగుతాననీ, అందులో మీరే నన్ను స్వయంగా అభినందిస్తారని నేనూ ఎన్నడూ వూహించుకోలేను. మీరు నన్ను మర్చిపోకుండావుంటే అదే చాలు." అన్నదామె. "ఎంతిమాట!" అన్నది చిరునవ్వుతో రాధ. ఇంకోగంటే వ్యవధివుంది రాధకి.

ఇద్దరికీ మనస్సులో విచారంగానే వుంది విడిపోతున్నందుకు. ఒకరికొకరు అత్యాప్తంగా, ఆసమానంగా కనుపించారు. రాధ తన చిరునామా యిచ్చింది మాలినికి ఎప్పుడూ వుత్తరాలు వ్రాసుకోవాలన్నది మాలిని. ఇంకో అరగంట వుండగా రైలు ఎక్కింది రాధ. మాలినికూడా ఆమెతోపాటు వెళ్లి ఇంటరు తరగతి కంపార్టుమెంటులో కూర్చుంది.

"నిజంగా రాధాదేవి! మీరిన్ని కథలు ఎలా వ్రాస్తారో నాకర్థం కాదు. ఆడవాళ్లలో మీ అంత గొప్ప రచయితలు ఎవరూ లేరనిపిస్తుంది నాకొక్కొక్కప్పుడు. ఈరోజు నేను ప్రయాణం చేయకపోతే ఈ జన్మకు మీ పరిచయభాగ్యం కలిగేది కాదు నాకు" అన్నది మాలిని.

రాధ నవ్వింది "అలాకాదు. ఆ గాలి విసురుగా రాకపోతే, ఆ పుస్తకం క్రింద పడకపోతే మనకి పరిచయం కలిగేదికాదు. మనము ఆ యీదురుగాలికి కృతజ్ఞులమై వుండాలి" అన్నదామె.

ఈ విధంగా పరస్పర అభినందనలతో కాలం గడిచింది. చివరకి భారంగా రైలు బెజవాడ విడిచింది రాధని తీసుకుని. మాలిని తన ప్రఖ్యాత స్నేహితురాలిని తల్చుకుంటూ గడిపింది ఆ రాత్రి ఆస్టేషనులో.

ఆ తర్వాత వారంరోజులకే రాధ వ్రాసింది మాలినికి తన యోగక్షేమాల్ని గురించి. లేఖాపరంపర సాగింది రెండు నెలలపాటు. రాధ కావ్యాల్లాంటి వుత్తరాలు వ్రాసేది. ఏవేవో కలలు, వూహాలు, సుందర వర్ణనలు వుండేవి ఆమె లేఖల్లో. మాలిని కంఠం ఎన్నిమార్లో శ్రావ్యంగా వినిపించింది 'ఆకాశవాణిలో'. నా హృదయాన్ని కదలివేస్తుంది మీ సంగీతం. నన్ను తీయని బాధలో ముంచివేస్తుంది మీ కంఠ మాధుర్యం" అని వ్రాసేది రాధ. ఒకరి కుటుంబాలనిగురించి ఒకరు తెలుసుకున్నారు. ఏవేవో విషయాలు వ్రాసుకున్నారు ఒకరికొకరు ఆంతరంగికురాండ్రయ్యారు వుత్తరాలద్వారానే.

మాలిని అంత భాగ్యవంతురాలు కాదు. ఆమెభర్త చిన్నగుమాస్తా ఒక ఆఫీసులో. ఆమె సంపాదనే ఎక్కువ అతని జీతంకంటే. ఆ సంగతి రాధ త్వరలోనే తెలుసుకుంది.

ఓమాటు వుత్తరంలో రాధ ఒక విచిత్ర ప్రస్తావన తెచ్చింది. "మీకంచిలో పట్టుచీరెలు

# కీర్తి తెరల మాటున 

కాగా చవుకట కాదా?" అని. పోనీ, కావాలంటే పంపుతానని వ్రాసింది మాలిని మిత్రురాలికి. "రేపే నేను మనియార్డరుపంపుతున్నాను 50 రూపాయలు" అని వ్రాసింది రాధ. అది అందేలోగానే ఉదారంగు పట్టు చీర కొని పార్శెలులో పంపింది మాలిని. కానీ నెలగడిచినా ఆ మనియార్డరు రాలేదు, రాధదగ్గర్నుంచి జాబు లేదు. మాలిని మనస్సు అదోలా అయిపోయింది.

నిజానికి ఆ ఖర్చు విషయంలో ఆమె భర్తతో ఘర్షణపడింది. పిల్లల బట్టలకోసం దాచినసొమ్ము, భాగ్యవంతురాలైన స్నేహితురాలిమీద మోజుకొద్దీ వాడేసింది. నెలరోజుల అనంతరం ఆ చీర పంపినందుకు కృతజ్ఞత తెలుపుతూ, ఎమ్. ఓ. అందిందని ఆశిస్తున్నానంటూ రాధ వ్రాసింది.

కానీ—ఏమౌతుంది పంపిన మనియార్డరు? కొంచెం ఆలస్యమైనా ఎప్పటికో అప్పటికి అందాలికదా? అందలేదని వ్రాద్దామంటే నామోషీ వేసింది మాలినికి. నిజంగా పంపిందా రాధ? మాలిని మనస్సులో అనుమానం తోచింది. పంపివుండదు అసలు. అప్రయత్నంగా, క్రమంగా మాలినికి యిదివరలో కలిగిన సదభిప్రాయం సడలిపోయింది. ఒక 50 రూపాయలకోసం...ఛీ! అబద్ధం ఆడింది రాధ. పైగా నెలరోజుల తర్వాతనా కనుక్కోవడం? శ్రీమంతురాలై వుండి, 50 రూపాయలకోసం లోభత్వం చూపించింది. పోనీ, డబ్బు యివ్వడానికి యిష్టంలేకపోతే, ఆ చీర బహుమానంగా తీసుకున్నానని వ్రాయరాదూ?

మాలిని మనస్సు విరిగిపోయింది. ఇదివరకటి మైత్రిఅంతా మంచులా కరిగిపోయింది. ఆమె రాధకి యిదివరకులా వ్రాయలేకపోయింది. "మేమంతా క్షేమం మీ క్షేమం తెలుపవలసింది" అన్న పద్ధతిలో కార్డులు వ్రాయడం మొదలెట్టింది.

హైదరాబాదులోవున్న రాధ ఆ వుదారంగు పట్టుచీరె ధరించింది ఎన్నిసార్లో. మాలినికి మనియార్డరు పంపుదామనుకుంటుండగానే ఆ చీర వచ్చింది. అదో బహుమానం కావచ్చు అనుకుంది ఆమె. డబ్బు పంపేశానని వ్రాసింది, మాలిని ఏమంటుందో చూద్దామని. ఏమీ అనకపోయేసరికి, 'ప్రేమపూర్వక బహుమానం' అని పేరుపెట్టేసి, ఆ చీరని స్వీకరించింది. ఆ తర్వాత ఆమెకి డబ్బు పంపాలనిపించలేదు. ఆ సంగతి మాలినికి తెలిపే ధైర్యం లేకపోయింది ఆమెకి.

ఒకనాడు తన మిత్రురాలు, మద్రాసునుంచి వచ్చినావిడని కలుసుకుంది రాధ. మాటలసందర్భంలో మాలిని తన స్నేహితురాలని చెప్పింది రాధ.

ఆ రెండో ఆవిడ కళ్లు చిట్లించింది. "అదా? అది మీ ఫ్రెండేమిటి?"

రాధ నిర్ఘాంతపోయింది యీ అగౌరవ సంబోధనకి "అదేమిటండీ అల్లా అంటారు?" అన్నదామె ఆశ్చర్యపోతూ.

"సరే, నాకే చెప్తారూ? దాన్ని మర్యాదచేయమంటారా?" అంటూ ఆమె ఎన్నో గాథలు చెప్పుకొచ్చింది మాలినిని గురించి. రాధ మనస్సు వికలమైపోయింది. ఇవన్నీ చెప్పినావిడని పదిసంవత్సరాలుగా ఎరుగుంది రాధ. ఆమె అనవసరంగా ఒకర్ని గురించి అనే మనిషికాదు. నమ్మక తప్పలేదు రాధకి. నిజమే నేమో! మాలినిగురించి తనకేం తెలుసు వ్యక్తిగతంగా ఛీ! అలాంటి మనిషా యీ మధురగాయకురాలు? మనస్ఫూర్తిగా వ్రాయలేకపోయింది రాధ వుత్తరాలు.

అల్లా సన్నగిల్లింది వారి మైత్రి, కార్డులు కూడా వ్రాసుకోని స్థితికివచ్చారు వారు. ఒక సంవత్సరం గడిచింది...

ఒకనాడు రాత్రి [illegible].30 కి బెజవాడ రైలు స్టేషనులో, రెండోతరగతి వెయిటింగు రూంలో కుంద్రని బల్లదగ్గర - మాలిని కూర్చుని చదువుకుంటోంది. కళ్లుమంటలుగా వుండి, ఒక్కక్షణం కళ్లుమూసుకుందిఆమె

రాధ—ప్రవేశించింది. వెయిటింగు రూంలోకి. మాలినినిచూసి, ఒక్కక్షణం ఆగింది. గతమంతా తలపుకి వచ్చింది. ఏమని పలుకరించాలి యీవిణ్ణి? మాట్లాడడానికి మనస్సు వప్పలేదు ఆమెకి. నిశ్శబ్దంగా అబల్లముందు కూర్చుని, బేగ్ లోంచి కార్డుతీసి వుత్తరం వ్రాయసాగింది. మాలిని కళ్లు తెరచిచూసింది. రాధ! డబ్బు విషయంలో ఆనాడు నైచ్యం చూపించినావిడ!

ఇద్దరూ ఒకేసారి ఒకరివంక ఒకరు చూసుకున్నారు. ప్రయత్నపూర్వకంగా నవ్వింది రాధ. నీరసంగా నవ్వింది మాలిని.

"ఓహో! కులాసానా?" అన్నది రాధ.

"ఆ ఆ. మీరు? ఎందాకావెడుతున్నారు!" అన్నది మాలిని.

అరగంట టైముంది మాలినికి. ఒక పది నిముషాలసేపు అర్థంలేని, పేలవమైన సంభాషణ మాలినితో గావించిన తర్వాత ఆమె లేచింది.

"వస్తానండి మరి. బొత్తిగా వ్రాయడం మానేశారేం వుత్తరాలు" అన్నది యథాలాపంగా.

"ఏమిటోనండి, ఖర్చులెక్కువైపోయి, కవరు కొనడానికికూడా పిసినారితనం చూపిస్తున్నారు మావారు. అదీ కాక మిత్రులికి కానుకలు, బహుమానాలు ఎక్కువైపోయాయి యీ పిల్లల 'సీజన్'తో" అన్నది మాలిని. బలే దెబ్బకొట్టాను అనుకున్నది.

రాధం ముఖం ఎఱ్ఱబడింది "ఆహా! అల్లాగా! వేరే ఏమన్నా పనివుండి తీరటం లేదేమో అనుకున్నాను" అన్నదామె. ఇక మరీ ముఖంమాడ్చేట్టుగా వుంది అనుకుంది రాధ.

నమస్కారాలతో విడిపడ్డారిద్దరూ. ఆక్షణంలో—ఒక ప్రఖ్యాత కథకురాలికి వీడ్కోలిస్తున్నానని మాలినీ అనుకోలేదు; ఒక మధురగాయనిని విడిచి పెడుతున్నానని రాధా అనుకోలేదు.

★

# స్వప్నభంగం

## ప్రాచీన గాథాలహరి

౧

హిమవత్పర్వతశిఖరాలపై వసంతసాయం సంధ్యాకిరణాలు బంగారుగొడుగులెత్తి పట్టుకొన్నాయి. కొండచరియలపై కమ్ముకొన్న హిమఖండాలు వెండి వానల జలులే కురిపించాయి. పురివిప్పి ఆడే నీలి నీలి నెమళ్లు సంజెవెలుగులలో పసుపుపచ్చని మేలిముసుంగులు ధరించాయి. వెన్నెల వెలుగులు విరజిమ్మే చమరీ మృగాలవాలాలే ఆ వెలుగులలో సువర్ణ చామరాలై సంచలించాయి.

ఆ ప్రశాంత వసంత సాయంసంధ్య వేళలో హిమవత్పర్వత పరిసరాలన్నీ కాంచన గంగాప్రవాహాల వెల్లువలు ముంచెత్తినట్లై ఒక విచిత్ర స్వప్నలోక విభ్రాంతి కలిగించాయి.

ఆ సంజవేళ వరూధిని తన భవనోద్యాన వనంలో పూల పాన్పుపై మేను వాల్చి, నిశ్చల దృష్టితో సంజె వెలుగుల సొగసులు పరిశీలించింది. ఆమె కనుగొలుకులలో వేడి వేడి కన్నీటి బిందువులు సన్నని జాలై ప్రవహించాయి.

అంతలోనే నేలపై రాలిన దేవదారు పర్ణాలలో కలకలస్వనం చెలరేగింది. వరూధిని అప్రయత్నంగా అటువైపు చూచింది. కాని ఎవ్వరు అక్కడికి నడిచి వచ్చిన జాడ కనిపించలేదు. మళ్ళీ ఉసూరుమని ఒక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టింది. వెంటనే ఆమె కన్నులనుండి వేడివేడి కన్నీరు జలజలా ప్రవహించింది.

ఆనాడు జరిగిన సంఘటనలు తలచుకొన్న కొద్దీ ఆమె హృదయం దారుణ సంతాపాగ్నిలో మగ్గి బుగ్గి అయిపోయింది.

"భూసురవర్యా! మదన వేదనలో వాడి వత్తలయి, దైన్యం మూర్తీభవించిన చూపులతో చేయిపై చెక్కిలి ఆన్చి, పైగాలి సోకినంతనే వెన్నవలె కరిగిపోయే అలివేణులను బిగికౌగిట జేర్చే మహాభాగ్యం ఎన్ని జన్మలకు కలుగుతుందయ్యా! ఒక్కమారాలోచించుకోవయ్యా!"

అని దీనాతిదీన ముఖంతో ఎన్నెన్నోమారులు ప్రార్థించింది. కరుణించి ప్రాణాలు నిలపవలసిందని ప్రాధేయపడింది.

అయినా ప్రవరుడామె ప్రార్థన చెవి కెక్కనియలేదు. ఎంతసేపు అరుణాస్పద పురానికి దారి చూపించవలసిందన్న ఘోషే!

అతని తిరస్కారంతో ఆమె ఒక్కమారుగా తల కొట్టివేసినట్లయింది. అయినా ఇంకా ఎన్నెన్నో విధాల చెప్పి చూచింది. ఎన్నెన్నో విధాల ప్రాధేయపడింది. ఆ తిరస్కారావమానభారంలో నిలువునా కుంగిపోయింది.

అంతలో ఆమె పౌరుషం తోకతొక్కిన తాచులా కస్సుమని పడగెత్తి బుసకొట్టింది. ఆ అవమానం ఆమెకిక దుర్భరమైపోయింది. మరి తాళలేక నిలుచున్నపాటుగా ప్రవరుణ్ణి గాఢంగా కౌగలించుకొన్నది. అతని పెదవి ముద్దుపెట్టుకోబోయింది.

దానితో అతడు 'హరి హరీ!' అని ముఖం ఇంకొకపక్కకు తిప్పివేసుకొన్నాడు. ఆమె నొక్కమారుగా వెనక్కి తోసివేశాడు. దానితో ఆ వరూధిని నేలపై కూలిపోవలసిందే! కాని ఎలాగో అలాగ కాలు నిలవదొక్కుకొని నిలబడింది. అయితే ఆమె పాదాల కింది నేల పాతాళంలోనికి దిగజారిపోయింది! హృదయం నీరైపోయింది. అయినా ధైర్యం చిక్కబట్టుకొని గద్గదస్వరంతో తిరిగీ ఎన్నెన్నో విధాల ప్రాధేయపడింది

"ఎన్నెన్నో యజ్ఞయాగాదులు చేశావన్నావే! ఇంత మాత్రం దయాదాక్షిణ్యాలు లేని నీ వెన్ని యజ్ఞయాగాలు చేస్తేమాత్రం ఏమి ప్రయోజనం?" అని సూటిగా ఎత్తిపొడిచింది.

అయినా అతని మనస్సు కొంచెమైనా కరగలేదు. ప్రవరుడామె మేని జవాది పరిమళం సోకిన తన హృదయభాగం అంతా పక్కనే ప్రవహించే కొండకాలవనీటితో పరిశుభ్రంగా కడిగివేసుకొన్నాడు! ముమ్మారాచమించి పవిత్ర మంత్రోదకం శిరస్సుపై చల్లుకొన్నాడు! ఒక్కమారైనా వెనక్కి తిరిగి చూడకుండా, పరిసర దేవదారువనంలో పడి అదృశ్యుడైనాడు.

అంతటి అవమానం భరించలేక ఆమె వెంటనే ఉరిపోసుకొని ప్రాణపరిత్యాగం చెయ్యవలెనని నిశ్చయించింది. అంతలోనే ఆమెకు తాను దేవకాంతనన్న విషయం స్ఫురణకువచ్చింది 'అయ్యో' నాకు మరణించే అదృష్టమైనా లేకపోయెనే!' అని దిగులుపడిపోయింది

"ప్రాణేశ్వరులొక్కింత చిన్నచూపు చూచినంత మాత్రాన మర్త్యకాంతలైతే ప్రాణపరిత్యాగం చేసివేస్తారే! వారెంతటి అదృష్టవతులు!" అని వారి అదృష్టం తలుచుకుని తిరిగీ ఒక సుదీర్ఘ నిశ్వాసం విడిచిపెట్టింది.

ఆ పరిసరాలలో మళ్ళీ కలకలస్వనం చెలరేగింది సన్నని వేడివేడి సుడిగాలి దేవదారు పర్ణాలలో గిరగిరా తిరిగిందేమో! ఆమెకెవరో తనవెంపే నడిచివస్తున్నట్టు స్ఫురించింది! కాని అది సుడిగాలి కాదు. ఆమె చెలికత్తె హారిణి!

హారిణి లేడిపిల్లలా చెంగుచెంగున గంతులు వేసుకుంటూ క్షణంలో వరూధిని దగ్గిరికి వచ్చి ఆమె పక్కనే కూర్చుంది. వరూధిని ననేకవిధాలుగా బుజ్జగించి చెలికత్తెలందరు వాహ్యాళికి బయలుదేరుతున్నారనీ తనతో కలిసి రావలసిందనీ పట్టుపట్టింది. వారందరి ఆనందము, తన దురంత వేదన తలుచుకునేసరికి వరూధిని లోపలి దుఃఖం పొంగి పొంగి పైకుబికింది.

"అయ్యో వెర్రిదానా! ఆ బ్రాహ్మణకుమారుడేమైనా ఇంద్రుడా? చంద్రుడా? ఏదో అమాయకుడు. ఛాందసుడు కనక ఆసమయంలో అవిధంగా బెంబేలుపడిపుంటాడు. అంతేగాని నీ అందము, చందము చూచినవారింకెవరైనా ఒక్కక్షణమైనా మనసు నిలదొక్కుకోగలరా? ఎందుకే నీకింత బేలతనం?"

అని హారిణి ఇంకొకమారామెకు ధైర్యం చెప్పింది.

"ఎంతటి అందగత్తె అయినా తనంతట తానై వలచిన వనిత ఎవరికైనా తేలికేగదా!" అని చెలికత్తె అన్నమాటలకు వరూధిని

[illegible]

#  స్వప్నభంగం 

చెప్పే చెప్పనట్టుగా ఒక సమాధానం చెప్పింది.

మళ్ళీ హారిణి అందుకుంది:

"కాకపోయినా ఊరికే ఉత్తపుణ్యానికే నీవింత దిగులుపడిపోతున్నావే! ఆ వంట ఇంటి కుందేలిక ఎక్కడికి పోతుంది? అతడీ పరిసరంలో ఎక్కడో ఏ పొదరింటిలోనో కొంచెం విశ్రమించి ఉంటాడులే! అంతేగాని ఇంకెక్కడికి పోగలడు? ఒక మారు చూచి వత్తాము లేచిరా!"

అని హారిణి ఆమెను బలవంతంగా లేవదీసి కూర్చోబెట్టింది చెదరిన ముంగురులు సరిదిద్ది చెయ్యిపట్టుకుని లేవనీసింది పిమ్మట వారిదరూ కొంతదూరం నడిచివెళ్లారు. వారి కనతిదూరంలోనే కొలికతెల నవ్వుల కలకలాలు వినిపించాయి. అంతలోనే మంజుఘోష తొందరగా వారిదగ్గిరికి పరుగెత్తుకు వచ్చి వరూధిని చెవిలో ఏదో ఊదింది వరూధిని ఆ మాట నమ్మలేదు!

"ఊరికే నన్నేడిపించడానికే అంటున్నావు అంతే! నేనమ్మను!" అని నిట్టూర్చింది.

"పోనీ నీకళ్లారా చూస్తే నమ్ముతావా?" వరూధిని మరి మాట్లాడలేదు "అయితేరా?" అని మంజుఘోష ఆమె నొక చిన్నకొండ చరియమీదికి తీసుకుపోయింది.

"ఆ పువ్వులు కోసే అందగాడెవరో చూడు!" అని వేలెత్తి చూపించింది వరూధిని రెప్పపాటులేకుండా అటు వైపు చూచింది, ఆమె కెదురుగా అనతి దూరంలో కనిపించిన వాడద్భుంగా మున్మూర్తులా ప్రవరుడే!

వరూధిని కిక రెప్పపాటు పడలేదు! అలాగే శిలా ప్రతిమలా నిలబడి పోయింది!

౨

ప్రవరుడు పట్టుతోరం కట్టిన ముంజేతి మెరుపులతో మెల్లమెల్లగా పువ్వులు కోస్తున్నాడు. కిన్నెర కంఠంతో సామవేదం గానం చేస్తున్నాడు. ఆ వేదగానం దూరంనించి భ్రమరీ ఝుంకారంలా వరూధిని కర్ణకుహరంలో మారుమోగింది. 'అహా! ఎంత మనోహర సామగీతి!' అని వరూధిని ఆ గానమాధురిలో లీనమై పోయింది.

మంజుఘోష రెండుమూడుమార్లు ఆమె భుజంపై తట్టింది అతిన్మయంతో వరూధిని అది గమనించనేలేదు. మంజుఘోష మళ్లీ గట్టిగా తట్టింది వరూధిని వెనక్కి తిరిగి చూచింది

"ఏం! నేను చెప్పినది నిజమేనా?" కొంటెగా అడిగింది మంజుఘోష.

"నిజమేగాని - ఆటవికవనిత లెవరో ఆయన ఆకాశాని కెగసి అదృశ్యుడైపోయాడని అన్నారే!" అని అలాగే విస్తుపోయింది వరూధిని

"ఆటవికు లమాయికులు! - నీకు వాళ్ళ మాటలే నచ్చాయిగాని ఇంకా నామాటల మీద నమ్మకం కలగనేలేదన్నమాట! అయితే నీవే స్వయంగా ఆయనతో ప్రసంగించి చూడు! గానిరా! నీకే తెలిసి వస్తుంది! ఇంకా దగ్గిరికి వెళ్ళిచూదాం పద!"

అని మంజుఘోష ఆమె ప్రవరుని కింకా సమీపంగా తీసుకుపోయింది. వారతని సమీపంలోనే ఒక పొదరింటిమాటున నిల్చున్నారు. ఆ వరూధిని తిరిగి పరిశీలనగా చూచింది.

ఆ చూపుతో ఆమె సందేహం అంతా పటాపంచలైపోయింది. అతను ముమ్మూర్తులా ప్రవరుడే! ఏమీ సందేహంలేదు!

వరూధిని తన అదృష్టాని కెంతో మురిసిపోయింది. ఆమెకు శరీరం అంతా తేలికై గాలిలో తేలిపోతున్నట్లొక ఆనందానుభూతి కలిగింది! మంజుఘోష నెంతో ఆప్యాయంగా కౌగలించుకొని ఆమె చెవిలో చెప్పింది:

"మంజుఘోషా! నీవొక్కమా రాయన సన్నిధికివెళ్లి నా హృదయవేదన అంతా వారికి విన్నవిస్తావా?"

"నేనా?" అని నవ్వింది మంజుఘోష.

"నీవే మరి! నీవుకాక నాకింకెవరున్నారే!" ఎంతో దీనంగా బ్రతిమాలింది వరూధిని. ఆమె దీనస్థితి చూచేసరికి మంజుఘోష మనసు వెన్నపూసలా కరిగిపోయింది.

"సరే! నేను వెళ్లి నా శాయశక్తులా చెప్పి చూస్తానుగాని తీరా నీవై ఎదటపడితే నే గాని ఆ ఛాందసబ్రాహ్మణుని హృదయం కరగదేమో!" అని మంజుఘోష ప్రవరుని సన్నిధికి బయలుదేరింది.

ఆమె అక్కడినించి కదిలి వెళ్ళిపోయి నప్పటినించీ వరూధిని అలాగే ఆ ప్రవరుని కేసి, మంజుఘోష కేసి చూస్తూ నిలబడింది.

మంజుఘోషా ప్రవరులిద్దరు వరూధినికి మాటలు వినబడీ వినబడనంత సమీపంలోనే ఉన్నారు. ఆమె చెవులొగ్గి వారి మాటలేమైనా విస్పష్టంగా వినబడగలవేమోనని ఆశించింది. కాని వారి సంభాషణ ఆమెకంతగా విస్పష్టంగా వినిపించలేదు.

కాని కొంత సేపటికి ప్రవరుని పెదవిపై ఒక చిరునవ్వు వికసించింది అది మొదట ముత్తెమొగ్గగా, కనిపించి క్రమంగా పూవై రేకు తొడిగింది! ఆ చిరునవ్వు చూచేసరికి వరూధిని హృదయంలో ఒక చిన్ని ఆశా ముకుళం వికసించింది.

అదీగాక ప్రవరుని ముఖంలో అంతకు పూర్వం ప్రత్యక్షమైన నిర్దాక్షిణ్య రేఖ అంతా కరిగి పోయింది!

తరవాత మంజుఘోష తిరిగి వచ్చేదాకా వరూధిని అలాగే నిరీక్షించింది

పిమ్మట కొంతసేపటికి మంజుఘోష తిరిగి వచ్చింది. వచ్చి రాగానే వరూధిని ఎంతో ఆత్రంగా అడిగింది:

"ఏమైనదే నా మాట!" మంజుఘోష ఆ ప్రశ్నకొక్క వేడి నిట్టూర్పుతో సమాధానంఇచ్చింది: "వరూధినీ! ఎంతటి కఠినాత్ముడే ఆ ప్రవరుడు! అలాంటి కొరకరాని కొయ్యను నేనెక్కడా కనీవినీ ఎరగనే తల్లీ!"

ఆ మాటతో వరూధిని దిగాలు పడిపోయింది! జిహ్వాగ్రంలో తడి ఆరిపోయిన పెదవి తడుపుకొని ఎంతో ఆత్రంగా అడిగింది. "అదేమే! అలాగంటున్నావు! ఇక మరి ఆశఏమీ లేదా?" "ఏమోనమ్మ! ఎంత చూచినా నాకేమీ ఆశ కనిపించడంలేదు! కాని ఒక్కమాట! నీవే ఒక్క మారాయనతో విన్నవించుకుంటే ఏమయినా కొంచెం మనసు కరుగుతుందేమో!"

పిమ్మట కొంతసేపటివరకు నోటిమాట లేక వరూధిని దిగాలుపడిపోయి అలాగే నిలబడింది తరవాత తిలోత్తమ, హరిణి మొదలైన చెలికత్తెలంతా వరూధినిని వెతుక్కుంటూ అక్కడికి జేరుకొన్నారు. వారందరు జరిగిన దంతా విన్నారు. హరిణి వరూధిని కతిరహస్యంగా ఏమేమో బోధించింది. ఆ మాటలతో వరూధినికి మళ్ళీ కొంచెం ధైర్యం చిక్కింది. సవిలాస మందగమనంతో ప్రవరుణ్ణి సమీపించింది.

అలాగ నడిచి వెళ్ళిందన్నమాటేగాని వరూధినికి మనసు మనసులో లేదు. కేవలం శరీరమే నడిచివెళ్ళింది. అసలే సంకోచంతో కుంచించుకుపోయిన ఆమె హృదయం సిగ్గుతోను వేదనతోను చిమిడిపోయింది. తలవంచి కాలిబొటన వ్రేలుతో నేలపై రాస్తూ ఏమేమో పలికింది: తుదకామె అన్నమాటల అర్థం ఆమెకే తెలియలేదు! చివరికామె కన్నీళ్లే ప్రవరుని కామె హృదయం వ్యక్తీకరించాయి. కొంచెం ధైర్యం తెచ్చుకొని తన మనోగత వేదన కొంతవరకు అతనిఎదట వెళ్లబోసింది.

ఆ ప్రార్థన విని ప్రవరుడొక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు: "ఇంటిదగ్గర తల్లిదండ్రులు భార్యా పిల్లలు నాకోసం ఎదురు తెన్నులు చూచిచూచి ఎంతగా కుమిలి కృశించి



# స్వప్న భంగం



పోయాగో గదా! వారంతా అవిధంగా కుమిలి కృశించిపోతుంటే నేనే విధంగా సుఖించగలనో చెప్పు!

"నేనేమో సన్యాసి ననుకుంటున్నావేమో! నేనేమీ అలాంటి సన్యాసిని మాత్రం కాను! కాని నామనస్సీవిధంగా వికలమై పోయినప్పుడు నే నెలాగ సుఖించగలను!"

ఆ చివరిమాటలో వరూధిని కెదో కొంచెం ఆశాంకురం మొలిసింది.

అతనికేసి చూచింది. తలపైకెత్తి అలవోకగా పైకి కుంచెలాల కొంతులతని చిక్కని చెక్కిళ్ళపై తళుక్కుమని ప్రతిఫలించి ఫక్కుమని నవ్వాయి వలెవాటు వాటుగా వేసుకొన్న సరిగంచు ఉత్తరీయంలోని యజ్ఞోపవీతం సన్నని బాలనాగు కుబుసంలా ప్రతిఫలించింది. పగడాలవంటి అధరాలపై ప్రసరించిన చిరునవ్వు సంజవేళలో లేతలేత వెన్నెలలా తళతళ లాడింది. వెంటనే వరూధిని నిట్టూర్చింది. ఆ నిట్టూర్పులో ఆమె పంచప్రాణాలు పైకెగిరిపోయినట్టుగా దిగాలు పడిపోయింది: రాని చిరునవ్వుతో చిట్టచివరికీ విధంగా విన్నవించుకొన్నది:

"బ్రాహ్మణవరేణ్యా! నీకెందుకంతైనా, చివిగాని దేనికోసమని ఇన్నిసార్లు లింతగా ప్రాధేయపడి నిర్బంధిస్తే మాత్రం ప్రయోజనమేమిటి! నీ ఆచారాలతోను, నిత్యనైమిత్తిక కర్మలతోను నీ విలాగే కలకాలం జీవించవలెననే నా కోరిక!

ఇక నామాటా! నీమీది వలపుతో ఇలాగ కుమిలి కుమిలి కృశించడం కంటె మరణించడమే వేయిరెట్లు ఎక్కువ మంచిదని అనిపించింది!"

ఆ మాట లన్నదో లేదో. ఆమె రెండు కళ్ళు కన్నీళ్ళ ప్రవహించాయి. వంచిన తల తిరిగీ పైకెత్తలేక పోయింది ఆమెకిక నిట్టూర్పువిడిచే రిక్తికూడా నశించి పోయింది.

ప్రవరుడామె దీనావస్థ పరిశీలించి ఒక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టాడు.

"వరూధినీ నే నీజన్మలో ఈ శరీరంతో ఇక నా జన్మభూమి చేరుకోలేను గదా! చూడగా చూడగా నేను రెండింటికీ చెడ్డ రేవడనై పోయే టట్టున్నాను. నీదైన్యం చూస్తే నా గుండె తరుక్కుపోతూంది. నీ విలాగ కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయపడుతున్నావు కనక నీకోసమైనా నా అసిధారా వ్రతాలన్నీ గంగలో కలిపివేస్తాను మరి! ఏమిచెయ్యను! లేకపోతే, ఇక స్త్రీ హత్యా మహాపాతకంకూడా నా కాళ్ళకు చుట్టుకోనేటట్టుంది!"

ఆ మాటలు చెవిని పడగానే వరూధిని హృదయం ఆనందంతో సొమ్మసిల్లిపోయింది. మళ్ళీ అడిగింది.

"మీరన్నమాట ముమ్మాటికీ నిజమేనా?"

"నిజమే వరూధినీ!"

అతడా మాట ముగించాడో లేదో! అంతలో ఆ పరిసరంలో పొదలింట్లచాటున దాగిన వరూధిని చెలికత్తెలంతా అక్కడ గుమికూడారు! వారిలో ఒక అప్సర కొంటెగా వరూధిని కేసిచూసి, ప్రవరుని చెక్కిలికొట్టింది:

"ఈ చేదుమందిక ఎలాగ దిగమింగుతాగో పాపం!" అని కలకలానవ్వింది.

"హరిణి ఎంత బెటుసరి చేశావయ్యా! ఇంతటి నెరజాణతనం ఎక్కడనేర్చావయ్యా!" అని అలాగే ఆశ్చర్యపడింది.

మంజుఘోష వరూధినిని కౌగలించి ఆమె ముంగురులు సవరించి—ప్రవరుని కేసి చూచింది:

"పాపం! అమాయకురాలిని చేసి మా వరూధిని నెంత బాధ పెట్టావు!" అని లేని కోపం తెచ్చిపెట్టుకొని కొరకొరలాడింది.

పిమ్మట అరణ్యంలో అంతటా వెన్నెల చిన్నెలు చెలరేగాయి. అప్సరలపరిహాసములా వెన్నెలతళుకులలో కరిగిపోయాయి.

## 3

వరూధిని ఆ మరునాడుదయమే శయ్యాగృహంలో నిద్రలేచి హేలగా కళ్ళుతెరిచింది. కాని ఆమెకు తెల్లవారినదనే నమ్మకమే కలగలేదు! మనోహరుడి మనోహరమైన ఆనందస్వప్నలోకంలో తేలిపోతున్నట్లు తోచింది. ఆమె పార్శ్వంలో అలసిసొలిసి శయనించిన ప్రవరుని కెంత ప్రయత్నించినా మరి కన్నులు విప్పనేలేదు!

వరూధిని ఆ శయ్యాగృహం అంతా కలయజూచింది వసంత ప్రాదుర్భవంలోకూడా గవాక్షాలపై తెల తెలనిమంచు తెరలింకా వేలాడుతూనే ఉన్నాయి. దూరదూరంగా దేవదారు తరువుల శాఖలపై పక్షుల కలస్వనాలప్పుడే మేలుకొన్నాయి. ఆమెహృదయంలోని ఆనందశ్రుతిపై మారుమోగే ఆ విహంగాల కలస్వనామె కతిలోక స్వర్గసంగీతంలా వినిపించాయి.

ఆ ఆనంద తన్మయతలో ఆమె శరీరం హంసతూలికలా తేలిపోయింది ఎంతో కష్టంమీద నొక్కి నొక్కి అడుగులు వేస్తే తప్ప ఆమె పాదాలిక నేలపై నిలబడనే లేదు!

ఒక్కొక్కప్పు డామె "నేను మేలుకొన్నానా? కలగంటున్నానా?" అని తనలోతానే ఆశ్చర్య పోయేది. మాటిమాటికీ కళ్ళునులుముకొని నాలుగువైపులా పరికించేది.

అది కలకాదన్న విషయంలో ఆమెకేమీ అనుమానం కలగలేదు! కాని ఆ తీయనికల ఎప్పుడో హఠాత్తుగా కరిగి కరిగి పోతుందేమోననే భయంపట్టుకొని వేధించసాగింది.

"ఆహా! నా జీవితంలో దివ్యులైనా ఊహింపలేనంత మహానందం అనుభవించాను! ఈ మానవ లోకానందం ముందు ఆ దివ్యలోకానందం ఒకలెక్కా! దీనిముందది దిగదుడుపే!" అని స్వర్గలోకానందం అంతా ఎందుకు కొరగానిదని ఈసడించివేసింది!

ప్రవరుడామె దనువు చెల్లించేముందొక నియమం పాటించవలెనని కోరాడు ఇద్దరు ఏకాంతంగా ఉన్నప్పుడామె కళ్ళుతెరవకూడదని కట్టడిచేశాడు. అది తమ దేశాచారమనీ అది పాటించక తప్పదనీ బలవంతం చేశాడు అదేగాక తన ఇష్టంలేనికే ఆమె తన్ను విడనాడి పోకూడదని కూడా ఒక నియమం విధించాడు

అతడిలాగ ఎందుకు కట్టడి చేశాడో ఆమెకు తెలియలేదు! ఆసమయంలో అది తెలుసుకోవాలనికూడా ఆమెకనిపించలేదు. ఆ రెండు కోరికలు ఆమెకెంతో విచిత్రంగా కనిపించాయి! ఇక పూర్తిగా తనతో కలిసి మెలిసి ఉండడానికే అతడావిధంగా కోరుకొన్నాడని ఆమె ఊహించింది. కాని ఆ

నాటిరాత్రి ఆనందం తలుచుకొని మరుక్షణంలోనే ఆ విషయం విస్మరించింది.

అలాగ రోజులు, వారాలు, మాసాలు గడిచిపోయాయి అయినా నానాటికీ ఆమె జీవితానందం వేయిమడుగులెక్కువే అయింది. ఆ ఆనందం అవధులు దాటినకొద్దీ అది ఎప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా చెయ్యిదాటి పోగలదేమోనన్న భయమే దానికొక అపూర్వ మాధుర్యం చేకూర్చింది.

ప్రవరుని నియమాలు పాటించడం ఆమెకేమీ కష్టమనిపించలేదు శృంగారంలో ప్రవరుని చిరునవ్వు సొగసు చూడగానే ఆమె శరీరం అంతా ఒక విశాల నేత్రమై వికసించేది! మరుక్షణంలోనే ఆనందభరంలో సొమ్మసిల్లి ముకుళించుకుపోయేది! ఇక ఆమె నేత్రాల మాట వేరే చెప్పనే అక్కరలేదు

తన ఇష్టంలేనిదే తన్ను విడనాడిపోకూడదని ప్రవరుడొక కట్టడి చేశాడు కాని ఆ కట్టడి విన్నప్పుడామె కలకలా నవ్వింది! 'ఈయన ఎంతటి అమాయకుడు!' అని ప్రవరుని అమాయకత కెంతో ఆశ్చర్యపోయింది.

ప్రవరుడే ఎప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా తన్ను విడనాడిపోగలడని ఆమె భయం! అందుచేత ఆ ఆనంద తన్మయతలో మైమరిచి అతని ఒడిలోనే ప్రాణాలు విడిచివెయ్యవలెననికూడా సంకల్పించింది కాని అతని ముఖం చూచిన మరుక్షణంలోనే తనకు మృత్యువు లేదనీ తా నమరకాంతననీ ఆమె కెంతో సహజంగా స్ఫురించింది!

అలాగ మరికొంతకాలం గడిచిపోయేసరికి ప్రవరునిలోని ఆనందం క్రమక్రమంగా గ్రీష్మ శిరీషపుష్పంలా వాడడం మొదలుపెట్టింది అతడెప్పుడు ఏదో విషాదభావంతో క్రుంగి కుమిలిపోతున్నట్లు కనిపించేవాడు. అతని ముఖంలోని విషాదరేఖకు కారణమేమో ఆమెకు తెలియలేదు. అయినా స్వపురంలోని తల్లిదండ్రులను, భార్యాపుత్రులను తలుచుకొని అతడావిధంగా కుమిలిపోతున్నాడేమోనని ఆమె అనుమానం! చివరికొకనాడు ప్రవరుణ్ణి ప్రశ్నించింది. అతనొక నిట్టూర్పు విడిచి మాట్లాడకూరుకున్నాడు అంతేగాని సమాధానమేమి చెప్పలేదు. క్రమక్రమంగా ఆమె భయోద్వేగం పెచ్చు పెరిగిపోయింది.

కొన్నాళ్ళకామెకు గర్భ సూచనలు కనిపించాయి. పట్టలేని ఆనందావేశంతో ప్రవరునికా విషయం తెలియజేసింది ప్రవరుడది విని ఒక చిరునవ్వు నవ్వాడు. అంతే అయితే ఆ నవ్వులో పూర్వ సంతోష రేఖ భాసించలేదు దానితో వరూధిని ముఖం వెల వెల బోయింది.

## ౪

వరూధిని తనకు జన్మించబోయే శిశువు ముఖంలో తమ ఉభయుల సౌందర్యరేఖలు కళ్ళారా చూచి ఆనందించవలెనని ఎంతో ఉవ్విళూరింది. ఆ శుభముహూర్తంకోసం ఎంతో ఉత్కంఠతో ఎదురుచూచింది. ఆ శిశువు తమ ఇరువురి అనురాగాలకు అద్వైతమూర్తిగా అవతరించగలదని ఆశించింది. తన భావనలో ఆశిశువు ముగ్ధముఖరేఖలూహించి ముద్దులవర్షం కురిపించింది.

కాని ప్రవరుని ఔదాస్యము, విషాదము పరిశీలించినపుడామెలో ఆనందం అంతరించిపోయేది. అతని ముఖంలోని ఆ పూర్వోత్సాహానందాలన్నీ క్రమక్రమంగా అదృశ్యమైపోయాయి. ఆవిషాదచ్ఛాయలు వరూధిని ముఖరేఖలమీదకూడా ప్రసరించాయి

ఒకనాడు ప్రవరుడెంతో సంతోషంతో వరూధిని దగరకు వచ్చాడు. అతని అపూర్వానందోత్సాహాలు చూచి వరూధిని నిర్ఘాంతపోయింది. విస్ఫారిత నేత్రాలతో ప్రశ్నార్థకంగా అతనివైపు చూచింది.

"అదృష్టవశాత్తు నాకా పాదలేపం అనుగ్రహించిన సిద్ధపురుషుడీప్రాంతంలోనే ప్రత్యక్షమైనాడు. నాకా పాదలేప రహస్యంఅంతా అనుగ్రహించాడు!"

అదివిని వరూధిని నిర్ఘాంతపోయింది. ఆ పాదలేపంవల్లనే ఆమెకు ప్రవరుని సందర్శనభాగ్యం కలిగింది తిరిగీ దానివల్లనే వియోగం కలగగలదేమోనని భయపడింది. ఆమెముఖం వివర్ణమై వెలవెలబోయింది. ఏమో చెప్పబోయింది. గాని కంఠం గద్గదికభారంతో స్తంభించిపోయింది.

ఆమె లోలోపలి దుఃఖవాహిని అంతా ఒక్కదూకులో అడ్డుకట్ట పడగొట్టివేసి పరవళ్లుదొక్కుతూ ప్రవహించబోయింది.

అంతలో ప్రవరుడామెను మృదువుగా కౌగలించుకొని మునివేళ్ళతో ముంగురులు సవరిస్తూ బుజగించాడు.

"వరూధినీ! నేనింటిదగ్గర లేకపోవడంవల మాపొలాలు పుట్రలు-అన్నీ పట్టిబీళ్లయి దవుడుపట్టిపోయాయట! భార్య, పిల్లలు నామీద ఆశలు వదులుకొని చిక్కి శల్యాలై కళ్లల్లో ప్రాణాలు పెట్టుకునిజీవిస్తున్నారట! అదిగాక ముక్కాలి ముసలివాళ్ళయిన తల్లిదండ్రులిద్దరు నాకోసం కృశించి కృశించి మంచాలుపట్టిపోయారట! పాపం ఆ సిద్ధపురుషుడు నా క్షేమవార్త వారికెరిగించి త్వరలోనే నన్నక్కడికి పంపిస్తానని వాగ్దానం చేసివచ్చాడట!

"నాకిప్పుడా పాదలేపరహస్యం అంతా తెలిసిపోయింది గదా! నిమిషంలో మావాళ్లనందరినీ చూచుకొని రెక్కలు కట్టుకొని మళ్ళీ మరు నిమిషంలోనే ఇక్కడ వాలిపోతాను! సరిగదా !"

అతడలా అన్నాడే గాని, ఎందుకో తడబడుతున్నట్టే కనిపించాడు. మాటిమాటికీ గొంతు తడి ఆరిపోయింది. కాళ్లు వణికాయి.

వరూధిని విస్ఫారిత నేత్రాలతో అతని వైఖరి అంతా జాగ్రత్తగా పరిశీలించింది:

"ఆ సిద్ధపురుషు డిక్కడికి రావడము, మీకా పాదలేపం ఇవ్వడము—అన్నీ కట్టి అబద్ధాలే. ఊరికే వేళాకోళానికంటున్నారు! ఆ సిద్ధపురుషు డిక్కడికి వస్తే నాకామాత్రం తెలియదనుకొన్నారా?" అని అతనిని గాఢంగా కౌగలించుకొన్నది.

"ఇది నిజమే! పరిహాసం కాదు!" అన్నాడు ప్రవరుడెంతో గంభీరంగా.

"నేను నమ్మను! ఇది నిజంకాదు! పరిహాసమే! తిన్నగా నావైపు చూడండి!" అని వరూధిని అతనిముఖం తనవైపు తిప్పుకొని నిశ్చలంగా అతని కళ్లలోతులు కొలిచింది. ఆ పైన తాను నిజం కనిపెట్టి వేసినట్లువ్వెత్తుగా ఒక్క నవ్వు నవ్వింది.

ప్రవరునికిక నోటమాట రాలేదు! నాలుక పిడచగట్టుకుపోయింది. అలాగే కొంచెం సేపుండి ఒక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టాడు.

"నీ వన్నది నిజమే వరూధినీ! సిద్ధపురుషు డిక్కడికి రానేలేదు! అదంతా నేనే కల్పించాను!"

"ఇన్నాళ్లుగా మీతో కలిసి మెలిసి

### విచిత్రకళ

ఆధునిక చిత్రకళా ప్రదర్శనం జరుగుతోంది. ఇద్దరు పత్రికా విలేఖరులు ప్రదర్శనమంతా చూసి ఒకచోట హఠాత్తుగా ఆగిపోయారు. ఒక విలేఖరి అక్కడున్న ఒక బొమ్మను చూపిస్తూ "ఇంత అనహ్యమైన బొమ్మని ఇక్కడెందుకు వేళ్ళాడగట్టారో నాకర్థం కావడం లేదు," అన్నాడు.

"బహుశా అదివేసిన ఆర్టిస్టు దొరికి ఉండడు," అని రెండో విలేఖరి అన్నాడు.

 

# స్వప్న భంగం



తిరుగుతున్నావే! మీ సంగతి నాకొమాత్రం తెలియదనుకొన్నారా!" అని సాభిప్రాయంగా నవ్వింది వరూధిని.

ప్రవరుడొక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు. అతని ముఖం వాడిపోయింది.

"వరూధినీ! నీవు నా విషయం అంతా గ్రహించానని అనుకొన్నావు గాని నిజంగా నీకు నా స్వరూపం కొంచెమయినా తెలియలేదు! అది తెలిస్తే నీవు నిలువునా నిర్ఘాంతపోతావు! నీ శాపాగ్నితో నన్ను భస్మం చేసివేస్తావు! నేనిక నీ కంట బడడానికి కూడా అంగీకరించవు! తెలిసిందా?"

"అదిగో! మళ్ళీ పరిహాసం ప్రారంభించారు!"

"పరిహాసం కాదు! నిజమే చెబుతున్నాను! చెప్పివేయమన్నావా?"

అతని ముఖగాంభీర్యం పరిశీలించిన పిమ్మట వరూధినికి ప్రవరుని మాట నమ్మకతప్పలేదు! ప్రవరుడు తన కథ మొదలు పెట్టాడు.

"వరూధినీ! పూర్వం ఒకప్పుడు గంధర్వ కుమారుడొకడు నీపై మరులుకొని నీ పాదాలపై పడి ప్రార్థించాడు. ఆ విషయం జ్ఞాపకం ఉన్నదా?"

వరూధినికా విషయం గుర్తుకు రాలేదు. జిజ్ఞాసార్థకంగా బొమముడి విరిచింది: కొంచెం సంకోచంతో తలవంచి అడిగింది:

"ఎవరా గంధర్వ కుమారుడు?"

"కాళ్లావేళ్లాపడి బతిమాలుకొన్నా నిర్దాక్షిణ్యంగా కసిరికొట్టివేశావే! అతడు!"

"మణిభద్రుడా?"

"అవును! మణిభద్రుడే!"

"ఓహో! అతనిమాటా మీరంటున్నది! అవును! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. అయితే?" అని వరూధిని రెప్పపాటు లేకుండా ప్రవరునివైపు చూచింది! ప్రవరుడు తలవంచి ఆమె పాదాలవైపు చూచాడు:

"ఇప్పుడు నీ కెదుటగా ఉన్నవాడా మణిభద్రుడే!"

"ఉత్తదే! నేను నమ్మను! చాలు! చాలు! మీ కొంటె పరిహాసాలు కట్టి పెట్టండి!"

అని హఠాత్తుగా వరూధిని అతన్ని తన బిగి కౌగిలిలో బంధించి వేసింది! ఆ కౌగిలిలో ప్రవరునికిక ఊపిరి ఆడలేదు! అయినా అలాగే రొజుతుంటూ నెమ్మదిగా నసిగాడు.

"కాదు! నిజమే! ముమ్మాటికీ నిజమే! నా మాట నమ్ము!"

"అయితే దీనికి తార్కాణం?"

"మనం ఇద్దరము ఏకాంతంగా ఉన్నప్పుడు నిన్ను కళ్లు మూసుకోమన్నాను జ్ఞాపకం ఉందా?

"అవును! జ్ఞాపకం లేకేమి?" "ఆ సమయంలో నా గంధర్వ స్వరూపం బయటపడిపోగలదనే భయంతోనే నే నా కట్టడి చేశాను!" నీ కింకా నమ్మిక కలగకపోతే వెంటనే నా స్వరూపం ధరించి వేస్తాను! నా స్వస్వరూపం ధరించమన్నావా?"

"వద్దు! వద్దు!" అని వరూధిని ఇంకా గాఢంగా అతన్ని కౌగలించుకొన్నది! కాని మరుక్షణంలోనే తన కౌగిలింత సడలించి వేసి, కొంచెం దూరంగా నిలబడింది! ఆమె ముఖంమీద కత్తివాటు వేసినా నెత్తురు చుక్క లేదు! ప్రవరునికి వినబడీ వినబడనట్టుగా-'అయితే ఆ బ్రాహ్మణ కుమారుడేమైపోయాడు?"

అని ప్రశ్నించింది. ఆమె గొంతు తడి ఆరిపోయింది. కాని ఆ ప్రశ్న అతని హృదయంలో ఒక బాకులా పొడుచుకుంది.

"అగ్నిదేవుని అనుగ్రహంపొంది ఆ క్షణంలోనే తన ఆటపట్టుకి ఎగిరిపోయాడు." "మరి మీ రీ స్వరూపం ఎలాగ ధరించగలిగారు?" దూరంనించి మీ ఇద్దరికీ మధ్యనడచిన వ్యవహారం అంతా పరిశీలించాను! వెంటనే శాంబరీ విద్యతో నేనీ మాయాప్రవరుని స్వరూపం ధరించాను!"

"నిజమేనా?"

"నిజమే! వరూధినీ!" అని ప్రవరుడు తలవంచుకొన్నాడు.

ఆ మాట వినబడగానే వరూధిని 'అమ్మ' అని అక్కడే కుప్పగా కూలబడిపోయింది. అతనికేసి వెర్రిగా చూచింది. కాని దానిలో జీవచైతన్యం అంతా సన్నగిల్లిపోయి కేవలం అణుమాత్రంగా నిలబడింది:

"వరూధినీ! నీకివిధంగా ఎంతైనా ఘోర ద్రోహం చేశాను! అయితే నీమీది గాఢానురాగం వల్లనే నేనింతటి ద్రోహాని కొడిగట్టాను! నీ తీవ్ర శాపాగ్నిలో దహించివేస్తేనేగాని నా పాపానికి నిష్కృతి లేదు! ఆ శాపాగ్నిలో భస్మమై నా పాప పంకిలం కడిగివేసుకోవాలనే సంకల్పంతో ఇదంతా నీ కెరిగించాను! ఇక నీవు నన్నే విధంగానైనా సరే శపించివెయ్యవలెననే నా ప్రార్థన."

అని మాయాప్రవరుడామె పాదాలపై వాలిపోయాడు. ఆ ఉత్తర క్షణంలో వరూధిని అతన్ని తీవ్ర శాపాగ్నిలో దహించి వెయ్యవలెననే సంకల్పించింది! ఆ తీవ్ర శాపం ఆమె నోటిచివరిదాకా వచ్చింది. అంతలో అతని దైన్యం చూడగానే ఆమెకు కొంచెం జాలివేసింది. లేకపోతే అతడక్కడే-ఆమె గాఢశాపాగ్నిలో దగ్ధమైపోవలసిందే!

అంతలో ఆమెకు తన శిశువు విషయం జ్ఞాపకంవచ్చింది!

శిశువు కుమారుడే స్వారోచిషమనువుగా అవతరించగలడనీ, అతడు మానవ ధర్మ ప్రవక్త కాగలడనీ మానవావళి కతనివాక్కు దేవవాక్కుగా వినిపించగలదనీ హిమన్నగ మహాత్ములాశీర్వదించారు. ఆ శిశువు జనకుడే ఆమె కెదురుగా నిలబడి ఉన్నాడు! దీనాతి దీన వదనంతో తన్ను శపించివెయ్యవలసిందని ప్రార్థిస్తున్నాడు! అతనికీ, ఆమెకు మధ్య ఏర్పడిన మిథ్యానురాగబంధం మూలంగా జనించిన శిశువు కుమారుడే మానవాళికిక ధర్మనిర్ణేతగా ధర్మమూర్తిగా అవతరింపబోతున్నాడు!

ఆ మనువు ధర్మనిర్ణయంలో కూడా ఆ మిథ్యానురాగ చ్ఛాయ లలాగే నిలిచిపోతాయేమో! మానవజాతికొ ధర్మపురుషుడుగా అవతరించే అతని సంతతివారందరికీ అలాంటి మిథ్యానురాగ భ్రాంతులే బయలుదేరుతూంటాయి కాబోలు! ఎంతటి హృదయ విదారకమైన విధి వైపరీత్యం! అని వరూధిని లోలోపల కుమిలిపోయింది. ఆమె కాక్షణంలో మాయాప్రవరునితోబాటు తన గర్భంలో ఉన్న శిశువునుకూడా తీవ్ర శాపాగ్నిలో దహించివేసి వెంటనే ప్రాణ పరిత్యాగం చెయ్యవలెనన్న సంకల్పం కలిగింది.

కాని మళ్ళీ ఉత్తరక్షణంలోనే ఆ శిశువు మీద ఎంతో జాలికలిగింది. ఆ జాలిలో అణుమాత్రం మాయాప్రవరునిమీద కూడా ప్రసరించింది. కాని మళ్ళీ కళ్లెత్తి అతని కేసి చూడలేకపోయింది.

"మణిభద్రా! నీవు నన్ను కళ్లుమూసుకోవలసిందని కట్టడిచేశావు! నేనలాగే కన్నులు మూసుకొని మధురాతిమధురమైన స్వప్నలోకంలో మైమరిచాను! కాని అంతలోనే మళ్ళీ నా కన్నులెందుకు తెరిచావు! నీ వింతటి క్రూరుడవనీ, కఠినాత్ముడవనీ కలలోనైనా ఊహించలేదు! ఛీ నా ఎదుట నిలవకు! పో!" అని ఆమె అతని పాదాల సమీపంలోపడి ఆదేపనిగా వెక్కి వెక్కి ఏడ్చింది! అలాగ ఎంతసేపేడ్చిందో ఆమెకే తెలియదు!

మళ్ళీ కొంతసేపటికి కళ్లు తెరిచి చూచేసరికి మణిభద్రుడుకూడ కనబడలేదు!

మధురాతి మధురమైన వరూధిని స్వప్నం మంచు విడిపోయినట్టుగా కరిగి సురిగిపోయింది.

ఆ విధంగా యథార్థం చెప్పి వరూధిని కరుణ మారగొనవచ్చుననీ నిరంతరంగా ఆమె అనురాగ వాహినిలో ఓలలాడుతూ ఉండవచ్చుననీ గంధర్వ కుమారుడనుకొన్నాడు.

కాని అతని కలకూడా ఆమె చిట్టచివరి మాటతో కరిగిపోయింది! 

# బాలసాహితి

## మాతృభాష కిటుకు

సీతాదేవి

బహుభాషా కోవిదుడగు
పండిత మానవుడొక్కడు
రాయల సన్నిధి కొకపరి
రాణమీర నేతెంచెను.

పలుభాషల వారలతో
పలురీతుల భాషించెను
పండితులకచ్చెరువు పడగను.
బహుభాషా ప్రౌఢుడతడు.

'చిట్టచివర కతడనియెను
మహారాజా! మన్నింపుడు
మనవి యొకటి కలదండీ!
మన్ననమై యోచింపుడు.'

'వింటిరిగా మన ప్రౌఢత
కంటిరిగా మన చాతురి,
రహిమించగ చెప్పగలరె
మహి నాదగు మాతృభాష?'

ఏభాషల వారలతో
నాభాషలె తనవిగాను,
భాషించెడు పండితుండు
వేష మెటుల తెలియనగును?!

సభ చాలించెడు సమయము
సమీపించు చుండెనపుడు
సభాసదుల నొక్కరైన
స్పష్టముగా పలుకరైరి

రాయలవారతి సూటిగ
రామకృష్ణు దెసగాంచిరి.
అది జూచిన యాతడపుడు
ఆరాత్రికి గడువు వేడె.

అర్ధరాత్రి తన విడిదిని
నిద్రించెను పండితుండు.
నిద్రలేని రాము డచట
భద్రముగా పొంచియుండె.

అదను చూచి పొంచియుండి
నసలు సిసలు ధీమంతుడు
పండిత సత్తము నప్పుడె
బడితతోడ భూషించెను.

అచ్చముగా నాంధ్రభాష
'నమ్మో మొర్రో' యనుచును
దెబ్బల కోర్వఁగ జాలక
బొబ్బరించె పండితుడు!

'మహారాజా! ఈ మహితుడు
మరళ మరల మనవాడే!'
రాయలవారచ్చెరుముగ
'నేయది నీ సాక్ష్య'మనిరి.

'అడుగు డిపుడె మహాప్రభూ!
అల పండిత శేఖరునే
మనవాడే కాని 'యడల'
మన తెనుగున నెటులేడ్చును?'

'ఎంతటి ప్రతిభావంతుడు,
ఏ భాషల నేర్చిన మరి
ఏవియు కొఱగాని వేళ
ఏడ్చునదే మాతృభాష!'

# ఆహా!

కన్నసామి

బాల సాహితి



ఇది ఈనాటి కథకాదు. నేనింకా మావూరి ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్నప్పటి భోగట్టా !

ఒక ఆదివారం నేనూ మా అక్కయ్యలూ చద్దిఅన్నాలు తిని విశాలమైన మా వీధి అరుగుల మీదకు వచ్చాం! శీతకాలం! పచ్చిక మీద మంచు బొట్లు చూస్తూ వెచ్చని ఎండకోసం కాచుక్కూర్చున్నాం. ఇంతలో మా తాతయ్య 'ఇంకా ఎండరాలేదట్రా' అంటూ వచ్చాడు. ఇంక మా కాలక్షేపానికి లోటులేదు. కథ చెప్పమన్నాం. 'పగలు కథ ఏమిట్రా' అన్నాడు. ఏవో కబుర్లు ప్రారంభించేసరికి-వీధిలోనుంచి ఒక ఆడమనిషీ (అడుక్కునేదానిలా వుంది) చిన్నపిల్లా, మా యింటికి వచ్చారు. "తెల్లవారిందో లేదో అప్పుడే ముష్టివాళ్లు! పొండి" అంది పెద్దక్కయ్య. ఆ ఆడమనిషి దీనంగా ముఖంపెట్టింది. నాకు జాలివేసింది. ఆమె యిలా చెప్పడం ప్రారంభించింది.

"ఈయేలకి పదేను రోజులైంది బాబూ యిల్లా ఊరూరూ తిరుగుతున్నాను—"

"తిరక్కపోతే ముష్టి దొరుకుతుందా" అన్నాను నేను మధ్యలో.

"ముష్టికోసం కాదు బాబూ! రెండునెలల కిందట నా పెనిమిటి పక్షవాతంవచ్చి మంచానపడ్డాడు. ఏ డక్టర్లూ బాగుసెయ్యలేకపోయారు బాబూ! అంతలో మా అదృష్టంకొద్దీ చేతిలో గంటపట్టుకుని తలపాగా చుట్టుకొని, వుంటాడొక జంగం—మావూరొచ్చినాడు బాబూ" మేమందరం కళ్లార్పకుండా చూస్తున్నాం-వింటున్నాం "తర్వాత" అన్నాం. "ఆఁ వింటున్నారు కదా" అనుకుందేమో ఇంకా ఉత్సాహంగా చెప్పకుపోతూవుంది

"అతగాడు మా ఘనమైన వొయిద్యుడు బాబూ! అతగాడిసెయ్యి తగిలేసరికి వారంరోజుల్లో మన మణిసై పోయినాడు బాబూ"

"బలే బలే" అంది చిన్నక్కయ్య.

తాతయ్య మాట్లాడకుండా వింటున్నాడు.

"అయితే నువ్విప్పుడు తిరగడమెందుకు" అన్నాను నేను.

"అదే సెప్తున్నాను బాబూ నారాత బాగులేదు. ఆ వొయిద్యుడు పత్తేం ఎంతసెప్పి ఎల్లినా ఇతగా డినిపించుకుంటేనా—మళ్లీ తిరగబెట్టింది బాబూ ఆ జబ్బు. ఊరూరా ఆ వొయిద్యుడుకోసం తిరుగుతున్నాను బాబూ" అన్నదా ఆడమనిషి.

"పాపం" అనుకున్నాం. తాతయ్య ఒక పిడికెడు బియ్యం పడెయ్యమన్నాడు. నేననుకున్నాను "ఆమె ముష్టికి రాలేదుకదా" అని.

# వెంకన్న



"బాబ్బాబు నా బాబే" అన్నదామె. నేను నాలుగు గింజలు పడేసి "తాతయ్యా అంత మంచి వైద్యులుంటారా! కిష్టప్పగారెన్ని మందులిచ్చినా మరి పని చెయ్యవేం" అన్నాను. ముష్టిమనిషి తాతయ్య వైపు చూస్తూ "మా ఘనమైన సెయ్యిబాబూ ఎంత జబ్బైనా ఆయన సెయ్యేస్తే ఎగిరి పోవలిసిందే" అన్నది.

తాతయ్య మౌనం చూసి మేమూ ఊరుకున్నాం. ఆమె "ఒస్తాను బాబూ" అని వెళ్ళిపోయింది. తాతయ్యతో నేనన్నానూ— "ఈ వైద్యుడు మన వూరొస్తే వెంకటం మామయ్య పక్షవాతం బాగు చేయిస్తే?" తాతయ్య బోసినోటితో ఒకసారి నవ్వాడు. నేను ఏం తప్పుగా మాట్లాడనో అని భయపడి ఊరుకున్నాను ఒక పట్టు పొడుం పీల్చి తాతయ్య ప్రారంభించాడు.

"ఇప్పుడు జ్ఞాపకమొస్తూవుంది. నీ చిన్నప్పుడిలానే దారినపోయే ఒక కుటుంబం వచ్చింది." అన్నాడు తాతయ్య పెద్దక్కయ్యవైపు చూసి. "ఊహూ" అన్నాం.

"ప్రతి యింటికివచ్చి 'బబూ ఆవాల వెంకన్న అని గొప్ప వైద్యుడు కోసం వెదుకుతున్నాం. మీకు తెలిస్తే చెప్పండి. నాకొడుకు ప్రాణాలు కాపాడినవారవుతారు. ఆయన సేతిసలవ మా మంచిది' అంటూ ఉంది.

"పాపం చివరకు దొరికాడా" అన్నది చిన్నక్కయ్య.

చెప్పున్నా. ఎవళ్ళం తెలియదని చెప్పేశాం. ఆ విధంగా ఊరందర్నీ ఈ కుటుంబం అడగడంవల్ల 'ఆవాల వెంకన్న' గొప్ప వైద్యుడని తెలిసింది ప్రజలకు కొందరా వైద్యుడు తమ వూరుకొస్తే బాగుండుననుకొన్నారు

మరునాడుదయం వీధిలో మందులు కావాలా అంటూ అడుగుతున్నాడు. అడిగిన వారితో గట్టిగా తన పేరు ఆవాల వెంకన్న అనీ తనకేదో దేశంలో మంచి పేరు వున్నదని చెబుతున్నాడు. అతని మాటలు విని ప్రజలు తమ అదృష్టం పండిందనుకున్నారు.

'ఇలా యిలా నీకోసం నిన్న నెవరో వచ్చారయ్యా' అంటే ఒక్క చిరునవ్వు నవ్వి "అలా యెందరో తనకోసం తిరుగుతూ వుంటూ"రన్నాడు. అతని అదృష్టం వల్ల ఒక పాతికరూపాయలమందుల దాకా అమ్ముడయాయి.

ఇంకా ఎంతో దూరం వెళ్లాలని ఆవూరు విడిచి పోయాడు. మరి కొన్నాళ్లకు అతని మందులు పని చెయ్యడంలేదని తెలిసింది. పైగా కొందరికి ప్రమాదం గూడా చేశాయిట.

"అయితే అతను నిజంగా వైద్యుడు కాదూ" అన్నది చిన్నక్కయ్య.

## ★ ఆవాల వెంకన్న ★

"ఇంకా మరి నమ్ముతున్నావా" అన్నది పెద్దక్కయ్య.

"ఎందుకలా చేశాడు?" అన్నాను నేను.

"ప్రజలను మోసపుచ్చి డబ్బు సంపాదించాలని ముందు — వాళ్ళే కొందర్ని పంపుతారు పేరు ప్రచారం చెయ్యడానికి" అన్నాడు తాతయ్య.

ఆ వేళ రాత్రి నాకు నిద్ర రాలేదు. ఆలోచన! 'తాత చెప్పినదే నిజమైతే తెల్లవారేక ఇందాకటి మనిషి చెప్పిన 'గంట, తలపాగా జంగం' రావాలికదా! ఒస్తే ప్యూర్లో ఏం తమాషాలు జరుగుతాయో!" అని.

ఉదయం నేనావిషయమే మరిచాను. పదిగంటలవేళ నిన్నముష్టిది చెప్పినట్లే తలపాగా చుట్టుకొని చేత గంటపట్టుకొన్న జంగం కనబడ్డాడు. అతన్ని కొందరు చుట్టుముట్టి గోల చేస్తూ చెఱువు వైపు నడుస్తున్నారు. ఇంతకూ సంగతేమిటంటే—

వెంకటం మావయ్య తన జబ్బుకి పదిరూపాయలు ఇచ్చి మందు పుచ్చుకొన్నాడట వెంకటం మావయ్య కొడుకు నమ్మకంచాలక "నెల రోజులుండి చికిత్స చెయ్యండి. ఖర్చంతా మేం భరిస్తాం" అన్నాడట. ఈ వైద్యుడు ససేమిరా, నేనుండనూ, వెళ్లిపోవాలి" అన్నాడట. దానితో మరీ అనుమానం జాస్తీ అయి కిష్టప్పగార్ని తీసుకువెళ్ళి మందు పరీక్ష చేయించాడు. అది ఎంతమాత్రం ఏ మందూ కాదు! వట్టి ఎఱ్ఱదుంపల పిండి!! ఆ పది రూపాయలూ కక్కమని గోలచేస్తున్నారిప్పుడు అందరూ.' ఇప్పటికి తాతయ్యమాటల్లో నిజం తెలిసింది.

పేటవైపునుంచి ఇద్దరు వ్యక్తులు వచ్చి "ఆవాల వెంకన్నను..." అడుగుతున్నారు. "చాలోయ్! ఇంకా ప్రచారం. దొంగ వెధవని పట్టుకున్నార్లే" అన్నారొకరు జవాబుగా. "మేమేం ప్రచారానికి రాలేదండి. మాడబ్బు కక్కాలి! అప్పుడు మేం కదలాలి! వీడి తాట ఒలుస్తాం" అంటూ చెఱువు వైపు పరుగెత్తారు.

చెఱువువైపు నుంచి వస్తూ నే తాతయ్య అన్నాడు- "ఆవాల వెంకన్నేరా వీడు! ఎలాగయితేం ఎనిమిది రూపాయలు కక్కాడులే! బతిమలాడితే రెండు రూపాయలు వొదిలేశారు. నిన్నటి ముష్టిది - వాడి పెళ్లామే! మొగుడూ పెళ్లాం కూతుళ్లు గట్టుకింద పండుకుంటు న్నారు. ★

బాలసాహితి సీరియల్

# సాగర గర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

**జరిగిన కథ :—**

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణంచేసే నౌకలకది ఇట్టే కనిపించు ఇట్టే మాయమయ్యేది. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కాన్సిల్‌తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ మహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతిరంగాలమీద ఒక పెద్ద వెలుగుకనిపించింది. ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్లవర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా, కాన్సెల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్ఠుగా భోజనం పెడతారు. తిరిగీ తను కన్నపానాలు రాలేదని అంతా మథన పడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుంది. కెప్టెన్ నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరూ బయటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు. కెప్టెన్ నీమో జలాంతర్గామి నడిపించేపద్ధతి అంతా ప్రొఫెసర్ అరోనాకు తెలియజేస్తాడు. పిమ్మట జలాంతర్గామి కిరువైపులా తెరుచుకున్న అద్దాలలోనించి అద్భుతమైన సాగరగర్భ జలచరాలు కనిపిస్తాయి. ఆ తరవాత జలాంతర్గామి సాగరగర్భంలోని క్రెస్పో ద్వీపానికి బయలుదేరుతుంది. తరవాత సాగరగర్భంలో క్రెస్పోద్వీపంలో వేట జరుగుతుంది. జలాంతర్గామి వానికోరో ద్వీపంమీదుగావెళ్లి గిల్బోవాద్వీపానికి సమీపంలో నిలబడుతుంది. అరోనా అనుచరులతో కలిసి ఆ ద్వీపంలో ప్రవేశిస్తాడు. ముగ్గురు గిల్బోవాద్వీపంలో వేట ముగించుకొనివస్తూండగా హఠాత్తుగా ఒకరాయి వారిదగర పడుతుంది. పిమ్మట కెప్టెన్ నీమో వజ్రాయుధంతో ఆటవికుల నందరినీ హడలగొట్టి వేస్తాడు. క్రమంగా జలాంతర్గామి పగడాలదీవి జేరుకుంటుంది. చనిపోయిన నావికునికొకనికి అక్కడ సమాధి ఏర్పాటుచేస్తారు. కెప్టెన్ నీమో మన్నారు సింధుశాఖలో ఒక పెద్దముత్యం సంపాదిస్తాడు. పిమ్మట ఎంతోచాకచక్యంతో ఒక బెస్తవాని ప్రాణాలు సంరక్షిస్తాడు. పిమ్మట జలాంతర్గామి మధ్యధరాసముద్రందాటి అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రవేశిసుంది.

## సాగరగర్భంలో బంగారు గుట్టలు, అగ్నిపర్వతాలు.

తరవాత నీమో నాతో ఇలా అన్నాడు :

"1702 ప్రాంతంలో హాలండు, ఆస్ట్రియా, ఇంగ్లండు దేశాలు మూడు కలిసి ఒకసంధి చేసుకున్నాయి. మూడు దేశాలు కలిసి

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

అనువాదం: "వినాయక"

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

అప్పట్లో స్పెయిను దేశపు రాజు అయిదో ఫిలిప్‌ను పడగొట్టివేసి అతని రాజ్యం కాజెయ్యాలనీ, అది ఇంకొకరికి అంటగట్టాలనీ నిశ్చయించాయి.

స్పెయిన్ దేశం యుద్ధంలోకి దిగవలసిన ఆవశ్యకత ఏర్పడింది. కాని స్పెయిన్‌దగ్గర యుద్ధం చెయ్యడానికి తగిన ఆర్థిక బలంగాని, అంగబలంగాని లేదు. అయితే అమెరికా నుంచి వెండి బంగారాలు స్పెయిన్

## ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

దేశం చేరుకునే పక్షంలో ఆ ఆపత్తు గడిచిపోయేటట్లు కనబడింది. ఆ రోజుల్లో దక్షిణ అమెరికాలో చాలా రాజ్యాలు స్పెయిన్ పరిపాలనలో ఉండేవి.

స్పెయిన్ దేశపు రాజు అయిదో ఫిలిప్ ఫ్రాన్సు దేశం చెప్పుచేతల్లో ఉండేవాడు. అందుచేత ఫ్రాన్సు స్పెయిన్ సహాయార్థం కొంత నౌకా బలం పంపించింది. ఆ నౌకా బలం సహాయంతో స్పెయిన్ దేశపు ఓడలు దక్షిణ అమెరికా నుంచి వెండి బంగారాలు తీసుకు వస్తున్నాయి.

ఆ ఓడలన్నీ వెండి బంగారాలతో సహా కాడిజ్ తీరానికి బయలు దేరాయి అంతలో ఆ ప్రాంతంలో ఆంగ్ల నౌకాదళం తిరుగుతున్నదన్న పుకారులు బయలు దేరాయి.

స్పెయిన్ నౌకా దళాధిపతి ఆ సంగతి విని నౌకా దళం ఫ్రెంచి తీరానికి జేర్చాలని నిశ్చయించాడు

కాని స్పెయిన్ దేశపు నావికులు దాని కంగీకరించలేదు. నౌకాదళం అంతా స్పెయిన్ దేశానికే జేరాలని పట్టుబట్టారు. కాడిజ్ నగరానికిగాని, దానికి వీలు లేకపోతే విగో అఖాతానికి గాని జేరుకోవాలని అన్నారు

అప్పట్లో విగో అఖాతానికంతగా అపాయంలో ఉన్నట్లు కనబడ లేదు. ఆ నౌకాదళాధిపతి మరి చేసేదేమీ లేక నౌకాదళం స్పెయిన్ తీరంలో ఉన్న విగో అఖాతానికి జేర్చాడు. అయితే వెండి బంగారాల దిగుమతి విషయంలో ఏర్పడ్డ ఒక చిన్న తగాదావల్ల ఆ దిగుమతి బాగా ఆలస్యం అయింది.

అంతలో ఆంగ్ల నౌకా దళం విగో అఖాతంలో ప్రవేశించింది. స్పెయిన్ నౌకాదళాధిపతి శాయ శక్తులా ఆంగ్ల నౌకాదళంతో యుద్ధం చేశాడు ఆ నౌకాదళాధిపతి పక్షాన పోరాడిన సైనికు లెంతో మంది లేరు.

ఆంగ్ల నౌకాదళం జయించి వేస్తుందని, వెండి బంగారాలతో నింపిన నౌకలు శత్రువుల చేతుల్లో పడిపోతాయనీ స్పెయిన్ నౌకా దళాధిపతి భయపడ్డాడు. ఇక గత్యంతరం లేక ఆఖరి నిమిషంలో అమూల్య సంభారాలతో నింపిన ఆ ఓడలన్నీ వెంటనే తగులబెట్టించి సముద్రంలో ముంచివేయించాడు. ఆ సంఘటనలన్నీ 1702 వ సంవత్సరం అక్టోబరు నెలలో జరిగింది."

అంతటితో కెప్టెన్ నీమో ఆకథ ఆపివేశాడు.

నౌకాకథ అతడెందుకు చెబుతున్నాడో బోధపడ లేదు.

"అయితే ఇంతకూ ఏమంటారు?" అన్నాను.

"ప్రొఫెసర్! మన మిప్పుడు విగో అఖాతంలో ప్రవేశించాము. ఆ అఖాతం అంతు కనుక్కున్నామంటే ఆ అమూల్య ధనరాసులన్నీ మన చేతుల్లో పడతాయి."

జలాంతర్గామి ఆ సమయంలో సాగరగర్భంలో ప్రయాణం చేస్తూంది.

కెప్టెన్ నీమో నన్ను తనవెంట రావలసిందని అడిగాడు. నేను సరే అని అతని వెంటపడ్డాను. మేమొక గదిలోకి వెళ్ళి కూర్చున్నాము. సముద్రం అంతా విస్పష్టంగా కనిపిస్తూంది. చుట్టూరా అరమైలు దూరందాకా విద్యుద్దీపాల కాంతిలో సముద్ర గర్భం అంతా ధగధగా మెరిసిపోతూంది. సముద్రం అట్టడుగున ఇసకకూడా ఆ వెలుగులో తళ తళ లాడింది.

కొంతమంది నావికులు సముద్రపు దుస్తులు వేసుకొని నెమ్మదిగా ఆ ఇసకమీదికి దిగి ఆ ప్రదేశం అంతా గాలించడం మొదలు పెట్టారు. చిన్నచిన్న పెట్టెలు విడగొట్టి ఎన్నెన్నో బంగారపుకడ్డీలు, వెండికడ్డీలు బయటకు తీసి తమ బుజాలమీద తగిలించుకొన్న సంచీలలో పడవేసుకున్నారు. మరికొందరు ఎన్నెన్నో ముత్యాల హారాలు సేకరించారు.

తరవాత వాటన్నిటితోటీ మళ్ళీ నాటిలస్ జలాంతర్గామికి తిరిగి వచ్చేశారు.

ఆ వెండిబంగారాలకడ్డీలు, ముత్యాల హారాలు మొదలైన అమూల్య వస్తువులు చూసి నేను నాకళ్ళే నమ్మలేకపోయాను! నావికుల వ్వన్నీ జలాంతర్గామిలో గుట్టలు గుట్టలుగా పోశారు! "ప్రొఫెసర్! సాగర గర్భంలో ఇంతటి అమూల్యమైన ధనరాసులు వుంటాయని మీరెప్పుడైనా ఊహించారా?" అన్నాడు కెప్టెన్ నాకేసి చూచి చిరునవ్వు నవ్వుతూ.

"సముద్రంలో 20 లక్షల టన్నుల వెండి ఉన్నదని ఇటీవలనే అంచనా వేశారు!" అన్నాను.

# ★ సాగరగర్భంలో సాహసయాత్ర ★

"ప్రొఫెసర్! మీరన్న మాట నిజమే. ఆ వెండి అంతా బైటికి తీయడానికి చాలా ఖర్చవుతుంది. చివరికి దానివల్ల నష్టమేగాని లాభం రాదు. అందుచేత అది విరమించి వేశారు. అయితే నాకలాంటిఇబ్బందు లేమీ లేవు; నేను నా నావికులను సముద్రగర్భములోకి దింపడమే తరవాయి! బస్తాలకొద్దీ వెండి బంగారాల పోగులు నా చేతుల్లో పడతాయి! ఇక్కడేగాదు! సముద్రంలో ఇంకా చాలా చోట్ల వెండి బంగారాల గుట్టలున్నాయి. తలుచుకున్నానంటే ఆ గుట్టలన్నీ ఇట్టే నా చేతుల్లో పడిపోతాయి. నేనెంత ధనవంతుణ్ణో గ్రహించారా?"

"నిజమేగాని ఈ వెండి బంగారాల గుట్టలన్నీ వెతికి పైకెత్తడానికి స్పెయిన్ దేశం ప్రత్యేకంగా ఒక కంపెనీకి కంట్రాక్టులు ఇచ్చినట్లుందే!" అన్నాను.

"ఎంతకి కంట్రాక్టు ఇచ్చారో?"

"50 కోట్లకు"

'అబ్బో అది చాలాకాలం నాటి మాట! ఇప్పుడిక్కడ వెతికితే ఆ కంపెనీకి వట్టి పెట్టెలు తప్ప ఇంకేమీ కనపడవు!"

"అయితే ఆకంపెనీ ఈకంట్రాక్టు తీసుకోడం మూలాన్న దివాళా తీసేస్తుందన్నమాట !"

"అవునంతే." అన్నాడు కెప్టెన్. తరవాత ఒక నిట్టూర్పు విడిచి పెట్టాడు.

"పాపం! ఆ ధనరాసులన్నీ బీద జనానికి పంచిపెడితే వాళ్ళెంత సుఖపడతారో ?" అన్నాను.

కెప్టెన్ నీమో దీనికేమీ సమాధానం చెప్పలేదు!

ఆ మాటవినగానే కెప్టెన్ నీమో కొంచెం బాధపడినట్లు కనిపించాడు కాని వెంటనే దురుసుగా అందుకొన్నాడు :

"ప్రొఫెసర్! నేనీ ధనరాసులన్నీ పోగు జెయ్యడంవల్ల బీద ప్రజల నోట్లో మట్టికొట్టానని అనుకుంటున్నారేమో! ఈ ధనం అంతా నా ఒక్కడి కోసమే పోగుజేసుకోవడం లేదు! ప్రపంచంలో పీడితప్రజానీకం సంగతి నేను విస్మరించి వేశాననుకొన్నారా ? ఈ ధనరాసులలో చాలా భాగం నేను వారి కోసమే వినియోగిస్తున్నాను."

అని కెప్టెన్ నీమో హఠాత్తుగా తనప్రసంగం అంతటితో ఆపి వేశాడు. తన గొప్ప తనం చెప్పుకోడానికి బిడియపడి అతడా విధంగా తన ప్రసంగం ఆపివేసి ఉంటాడని అనుకొన్నాను.

కెప్టెన్ నీమోకు మనిషి పొడ కిట్టక పోవడం వల్లనే సాగర గర్భంలో ప్రయాణం ప్రారంభించాడు. అంతవరకు అది నిజమే! కాని ప్రపంచంలోని ప్రజానీకం అంటే అతనికెంత కరుణ! బహుశః ఆ ధనరాసులన్నీ అతడు వారి కోసమే వినియోగిస్తున్నాడన్న మాట! అతడేవిధంగా వినియోగిస్తున్నాడో! ఎవరు చెప్పగలరు? బహుశః ఆ ధనరాసులతో అతడు గుప్త దానాలు చేస్తున్నాడేమో!

తరవాత కెప్టెన్ నీమో నా గదిలోంచి వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళిపోయిన కొంత సేపటికి నెడ్ లాండ్ అక్కడికి వచ్చాడు. నెడ్ లాండ్ అక్కడికి వస్తాడని అనుకుంటూనే ఉన్నాను

"నెడ్ లాండ్! పాపం నిన్న నీక దృష్టం కలిసిరాలేదులా ఉందే!" అన్నాను అతనికేసి చూసి.

"అవును! నేనేం చెయ్యను. సరిగ్గా చివరిక్షణంలో మీరు రాలేదు!"

"అవును! కెప్టెన్ నీమో మన కా మాత్రం అవకాశం కలిగించలేదు మరి! ఆ సమయంలో అతడు సముద్రం అట్టడుగున వెండి బంగారాల గుట్టలకేసి వెళ్ళిపోయాడు!" అని నేనా జరిగిన వింతలన్నీ అతని తెలియజేశాను.

నెడ్ లాండ్ ఓడలోనించి పారిపోయే వ్యవహారం అంతటితో విడిచి పెట్టలేదు. పోనీయండి. ఇంతటిలో మునిగిపోయేదేమి వుంది! అవసరమయితే ఈవేళ సాయంత్రమే పారిపోదాము." అన్నాడు.

"అయితే ఇప్పుడు జలాంతర్గామి ఎటువైపుగాపోతూందో తెలుసునా?"

"నాకేమీ తెలియడం లేదు!" అన్నాడు నెడ్!

"సరే! ఒంటిగంట అయ్యేసరికి మనమెక్కడ వున్నదీ తెలుసుకోవచ్చునులే!"

నేను వెంటనే నాటిలస్ టాపు మీదికి వెళ్ళిపోయాను. నెడ్ లాండ్ కూడా నా వెంటపడ్డాడు. ఎటు చూసినా ఎక్కడా భూమి కనబడ లేదు.

తరవాత నేను నాటిలస్యంత్రాల కేసి చూశాను. సముద్రతీరం సుమారు రెండు వందల మైళ్ళ దూరంలో వుంది. ఆ పరిస్థితిలో జలాంతర్గామిలోనించి బైట పడడ

మంటే మృత్యుగహ్వారంలో ప్రవేశించడమన్నమాటే.

అయితే దీనిమూలాన నేనేమీ కంగారుపడిపోలేదు. అదే హాయిగా ఉందని అనుకున్నాను.

కాని నెడ్‌లాండ్ కోపానికిక అంతూదరీ లేదు! కాని అతడేమి చెయ్యగలడు? వ్యవహారం అంతా పూర్తిగా చెయ్యి దాటిపోయింది.

తరవాత రాత్రి 11 గంటలయ్యే సరికి కెప్టెన్ నీమో నాదగ్గిరికి వచ్చాడు. "మీకొక అద్భుతమైన భూభాగం చూపించనా?" అన్నాడు. నేనాతడు చూపించే అత్యద్భుతం ఏమై వుంటుందా? అని ఎంతో ఆశ్చర్యపడ్డాను.

కెప్టెన్ నీమో నన్ను సాగర గర్భంలోకి వెళ్లే దుస్తులు వేసుకోవలసిందనిఆజ్ఞాపించాడు. నెడ్‌లాండ్ గాని కౌన్సెలుగాని మాతోరాలేదు.

మేమిద్దరము ప్రయాణమయ్యే సరికి ఇంచుమించుగా అర్ధరాత్రి అయింది.

మేము సాగర గర్భంలోనికి దిగి నెమ్మది నెమ్మదిగా నడిచి పోతున్నాము. క్రమంగా మా కెదురుగా ఒక పెద్ద అరణ్యం ప్రత్యక్షమైంది. అది అంతా సాగరగర్భంలో ఉన్న అరణ్యం!

ఆ అరణ్యంలోని చెట్లఆకులన్నీ 'నిశ్చలంగా ఉన్నాయ్.

దూరదూరంగా సముద్ర గర్భంలో నాకొక పెద్ద వెలుగు కనిపించింది! సముద్రగర్భంలో ఆ వెలుగెక్కడినించి వచ్చింది.

ఇంకా 'లోతుగా ఉన్న భూగర్భంలోని అగ్ని పర్వతం ద్రవమే ఆ పధంగా మెరుస్తున్నదని కెప్టెన్ నీమో నాతో చెప్పాడు. నేనా అగ్నిపర్వతం వెలుగు చూచి నా కన్నులే నమ్మలేక పోయాను. సముద్రం నీరా అగ్నిపర్వతంమీద ప్రవహిస్తున్నా, ఆ అగ్నిపర్వత ద్రవం అలాగే కళ్లు మిరుమిట్లు గొలుపుతూ మెరిసిపోతూంది!

అంతటి మహారణ్యం సాగర గర్భంలో ఉండగలదని నేను కలలోనైనా ఊహించలేను!

ఆ అరణ్యం అక్కడి కెలాగ వచ్చింది? ఏదైనా మహారణ్యంగాని హఠాత్తుగా సాగరగర్భంలో మునిగిపోయిందా?

ఎంతకీ ఆ సందేహం తెగక కెప్టెన్ నీమోకేసి సంజ్ఞ చేసి నా సందేహం అతనికి తెలియజేశాను!

కెప్టెన్ నీమో నాతో ఇలాగన్నాడు! "ప్రొఫెసర్! ఇదంతా ఒక పెద్దఖండం! ఇది పూర్వం ఆస్ట్రేలియా అమెరికాల వంటి భూఖండమే!"

"అయితే దీని పేరు?" అన్నానెంతో ఆశ్చర్యంతో.

కెప్టెన్ నీమో ఆ భూ ఖండ చరిత్ర మొదలుపెట్టాడు:

"ప్రొఫెసర్" ఇది అట్లాంటిస్ అనే ఖండం! ఈ ఖండం అంతా ఒక్కసారిగా సాగర గర్భంలో మునిగిపోయింది. ఇది మునిగిపోయి కొన్ని వేలఏళ్లు గడిచి ఉంటాయి!

ఈ ఖండాన్నిగురించిన నిదర్శనాలు కొన్ని ప్రాచీన గ్రీకు గ్రంధాలలో మాత్రమే కనిపిస్తున్నాయి. మీరు కూడా ఈ భూఖండాన్నిగురించి వినే ఉంటారనుకుంటాను."

నేనాభూభాగాన్ని గురించి ప్రాచీన గ్రంధాలలో చాలా చోట్ల చదివాను! దానిని గురించిన పుక్కిటిపురాణాలే మనకిప్పుడు మిగిలాయి. అంతకంటె వివరాలేవీ తెలియవు. ఆ భూభాగం ఎక్కడ ఉన్నదోకూడా ఎవరికీ తెలియదు!

కాని కెప్టెన్‌నీమో జలాంతర్గామి సహాయంవల్ల నేనా భూ భాగం ప్రత్యక్షంగా చూచాను! ఎంతటి అదృష్టం!

—ఇంకా ఉంది.

## 'పాయింటే'

ఇంటిబయట అరుగుమీద పదేళ్ళ అబ్బాయి కూర్చుని ఉన్నాడు. ఒక పెద్దమనిషి వచ్చి "అబ్బాయ్, మీ నాన్నగారు ఇంట్లో ఉన్నారా?" అని అడిగాడు.

"ఉన్నారు"

పెద్దమనిషి తలుపు కొట్టాడు ఎవరూ తలుపు తీయలేదు.

"ఇంట్లో ఉన్నారన్నావుగా?" అని పెద్దమనిషి అడిగాడు.

ఆ కుర్రాడు పెద్దమనిషిని గంభీరంగా చూసి "అవును, మా ఇంట్లో ఉన్నారన్నాను," అని సమాధానం చెప్పాడు.

## పాప: చిన్నతల్లి

"కడుపునిండా ఇన్ని పాలుపట్టాలి"



"నా చిన్నతల్లికి
లాల పొయ్యాలి"



"చిట్టిపాపకు నేను
ఉగ్గుపెట్టాలి"







ఫొటోలు : వి. కేశవశర్మ

# మా పాప

"రవి"

మాపాప నవ్వులే మల్లెపువ్వుల్లు
మాపాప కన్నులే కలువరేకుల్లు
మాపాప పలుకులే తేనెవాకల్లు
అందాల మాపాప చందమామల్లు
పాలబుగ్గల పాప పారాడుతుంటె
బంగారు కొండలే ప్రాకినట్లుండు
చిన్నారి మాపాప చిందులేస్తుంటె
గోపాలకృష్ణమ్మ గుర్తుకొస్తాడు.



# * కడుపు చిచ్చు *

ఒక కాలములో ఒక కొంగ ఉండేది.

అది చాలా ముసలిదైపోయి, దగ్గిరగా వచ్చిన చేపలనుకూడా చటుక్కున పట్టుకోలేకపోయేది. అందువల్ల దానికి తిన్నరోజులకన్న పస్తులున్న దినాలే ఎక్కువ అయాయి.

ఇలాగ ఉండగా ఆ కొంగకు ఒకనాడు ఒక మంచి పెద్ద చేప లభించింది. చాలా ఆకలిగా ఉన్న కొంగ ఆత్రుతతో దాన్ని భక్షిద్దామనుకునేసరికి ఎక్కడనుంచో ఒక మనిషి వచ్చి, కొంగ నోటిలోంచి ఆమత్స్యాన్ని లాక్కుని తనబుట్టలో పడేసుకున్నాడు!

కొంగ ఆశాభంగంవల్ల కలిగిన దుఃఖంతో, 'దుర్మార్గుడ, నానోట్లో ఉన్న కూటిని లాక్కున్నావేమిరా? నా చేపను ఇచ్చెయ్యి!' అన్నది.

వాడు వికటంగా నవ్వుతూ, 'నీచేపా? నీదైతే నా బుట్టలో ఎందుకుంటుంది?' అని చరచరా తన యింటికి పోయాడు.

ఆకలివల్ల కలిగిన నీరసానికి ఆశాభంగంవల్ల కలిగిన దుఃఖంతోడై పాపం ఆ కొంగ ఇంక చేపలకోసం ప్రయత్నించనేలేదు. కొన్నిరోజులలాగ పస్తులుండి, ఆఖరికొకనాడు కొంగ ప్రాణాలు విడిచేసింది.

కొంగయొక్క సిద్ధాన్నాన్ని ఎత్తుకుపోయిన ఆ దుర్మార్గుడు వెళ్ళి ఆ చేపను తన భార్యకు ఇచ్చాడు! 'మంచిచేపనే సంపాదించావే!' అని మెచ్చుకుంటూ ఆమె దాన్ని కూరవండి, వాడికి సగంపెట్టి తాను సగం తిన్నది.

మరికొన్నాళ్ళకామె కడుపుతో ఉండి, తొమ్మిదినెలలూ నిండేక గుమ్మడిపండువంటి కొడుకును కన్నది.

ఆ బాలుణ్ణి వాళ్లు ఎంతో ముద్దుగా చూసుకుంటూ పెంచారు. పద్ధెనిమిదేళ్లు గడిచి వాడికి పెళ్ళియీడు వచ్చింది.

## పాలంకి వెంకటరామ చంద్రమూర్తి

తండ్రి, 'నాకు కొడుకు చేతికి అందివచ్చాడు గనుక ఇంక నేను శ్రమపడనక్కర్లేదు. ఇంక రోజూ పొలానికి వాడే వెడతాడు.' అన్నాడు.

తల్లి 'ఔను. వాడికి పెళ్ళికూడా చేసేద్దాం. కోడలువస్తే దానికి పెత్తనం వప్పజెప్పి, నేనుకూడా కృష్ణా, రామా అనుకుంటూ ఒకచోట కూచుంటాను' అంది.

కాని వాళ్లు పెళ్ళికూతుర్ని చూడనక్కర్లేకనేపోయింది. ఏమంటే ఆ కొడుక్కి హఠాత్తుగా జబ్బుచేసి, వైద్యుడు రాకపూర్వమే మరణించాడు!

పుత్రశోకంతో ఆ తల్లీ తండ్రీ గుండెలు బాదుకున్నారు! జుట్టు పీక్కున్నారు!

ఆ తండ్రి అంతటితో ఊరుకోక, 'చేతికి అందివచ్చిన నా కుమారుణ్ణి తీసుకుపోయాడీ యముడు! వీణ్ణేనా "ధర్మరాజు" అంటారు? వీడి మొహం మండా, ఇదేనా వీడి ధర్మం?' అంటూ ఆ దేవుణ్ణి తిట్టిపోశాడు.

ఆ తిట్లు పడలేక యమధర్మరాజు ఒక అర్థరాత్రివేళ తన దున్నపోతుమీద ఎక్కి భూలోకానికి చక్కావచ్చాడు. మంచంమీద పరుండి నిద్రపోతూన్న ఆ తండ్రికి కలలో ప్రత్యక్షమై, 'ఎందుకోయ్ నన్ను తెగతిట్టిపోస్తున్నావ్?' అని అడిగాడు.

'ఎందుకేమిటి? నువ్వు చేసిన పాడుపనికి! చేతికి అందివచ్చాడనుకుంటూన్న నా కుమారుణ్ణి తీసుకుపోయావు!' అంటూ ఆ తండ్రి కలలోనే యముణ్ణి తిట్టడం ప్రారంభించాడు.

యముడు 'ఆగవోయ్, ఆగు. నాలోకంలో ఇప్పుడు కోటానుకోట్ల జీవులున్నారు. వారిలో నీ కొడుకెవరో నాకేం తెలుస్తుంది?' అన్నాడు.

తండ్రి, 'నీకు తెలియకపోవచ్చు గాని, నేను నా కొడుకుని ఇట్టే ఆనమాలు కట్టేస్తాను!' అన్నాడు

యముడు, 'అలైతే నాతో రా.' అని, ఆ తండ్రి జీవాన్ని తన పాశా

నికి తగిలించుకుని తన లోకానికి తీసుకుపోయాడు.

యముడు చెప్పినట్లు నరక లోకంలో లెక్కకుమీరిన జీవులు తాము చేసుకున్న పాపాలకు ఫలితాలను అనుభవిస్తూ కనపడ్డారు. యముడు తాను తీసుకువచ్చిన ఆ జీవునితో, 'వెళ్ళవోయ్, మీ వాడెక్కడున్నాడో వెతికి పట్టుకుని నావద్దకు తీసుకురా' అని వాణ్ణి వదిలాడు.

ఆ తండ్రి వెతికి వెతికి ఆ కుర్రవాణ్ణి పట్టుకున్నాడు. ఆప్యాయంగా ఆ బాలుని బుజంమీద తట్టుతూ, 'ఒరే అబ్బాయీ, నేనురా మీ నాన్నని!' అన్నాడు.

ఆ బాలుడు వెనక్కి తిరిగిచూసి 'ఛీ, నువ్వా నా తండ్రినంటున్నావు!' అని చీదరించుకుని అసహ్యంతో పురుగును విదల్చినట్లు విదల్చి దూరంగా పోయాడు.

తండ్రి నిర్ఘాంతపోయి, 'నాయనా, నన్నానవాలు పట్టలేదూ? అప్పుడే మరిచిపోయావురా బాబూ? ఈ లోకానికి వచ్చినవాళ్ళకి మరుపు ఇట్టే వస్తుందికామోసు!' అన్నాడు.

ఆ బాలుడు, 'మరుపా? నేనేం మరిచిపోలేదు. నువ్వే మరిచిపోయావు!' అన్నాడు.

తండ్రి మరీ విస్తుపోయి, 'అదేమిట్రా నాయనా. నేనేం మరిచిపోయాను! నీ ముద్దుచేష్టలన్నీ నాకు కళ్ళకు కట్టినట్టున్నాయి' అన్నాడు.

ఆ బాలుడు మండిపడుతూ, 'నా చేష్టలు కాదోయ్ మూర్ఖుడా! నీ చేష్టలు జ్ఞాపకం తెచ్చుకో! క్షుధార్తుడనై లేక లేక దొరికిన చేపను తిందామనుకుంటూంటే నా నోటిలోనిదాన్ని ఎత్తుకుపోయావుకదూ? జ్ఞప్తికి తెచ్చుకో!' అన్నాడు.

తండ్రి 'చేపా? ఏంచేప? ఎప్పటిమాటా, నువ్వు చెప్పేది?' అన్నాడు ఆలోచిస్తూ.

బాలుడు, 'ఎప్పటిమాటా? నేనా సరస్సులో కొంగగా ఉన్నప్పటిమాట!' అన్నాడు.

ఆమాట వినడంతోనే ఆ తండ్రికి ఏనాడో జరిగిన ఆ సంగతి మెల్లిగా జ్ఞాపకానికొచ్చింది. ఆరిపోతూన్న పెదిమలు నాలికతో తడుపుకుంటూ వాడా బాలునితో, 'ఐతే నువ్వు ఆ కొంగవా? నా కొడుకువి కావూ?' అన్నాడు.

బాలుడు, 'ఆ కొంగనే నీ కొడుకునై పుట్టి నా పగను దీర్చుకున్నాను! నా సిద్ధాన్నాన్ని పడగొట్టి నాకు శోకం కలిగించిన దుర్మార్గునికి కొడుకునైపుట్టి, ఆశలు కల్పించి, అందివస్తాననేవేళకి తప్పుకుని నీకు పుత్రశోకం కలిగించాను! ఆ పద్దెనిమిదేళ్ళూ 'కొడుకా, కొడుకా' అని నువ్వు పిలుస్తోంటే కర్ణకఠోరమైన ఆపిలుపు ఎలాగో సహించాను. ఇంక సహించను! వెళ్ళు!' అంటూ గుంపులో కలిసి మాయమైపోయాడు.

ఆ బాలుని తండ్రిననుకున్న ఆ జీవుడు మొహం వేలాడేసుకుని వస్తోంటే, యమధర్మరాజు, 'ఏమోయ్, ఒక్కడివే వస్తున్నావేం? ఏడీ నీ కొడుకు?' అన్నాడు.

ఆ జీవుడు, 'ప్రభూ, వాడు నా కొడుకు కాడుట. నామూలాన కడుపుచిచ్చు కలిగిన ఒక కొంగట. నాకు కొడుకై పుట్టి, ఈ రకం కడుపుచిచ్చుపెట్టి, పగ దీర్చుకున్నాడట!' అన్నాడు.

యమధర్మరాజు 'చూశావా మరి? అనవసరంగా ఇన్నాళ్లూ నన్ను తిట్టిపోశావు! నీ పాపఫలం నువ్వు అనుభవించాలిగాని నన్ను తిట్టడం దేనికి... వెళ్ళు. ఆ మంచం మీద ఉన్న నీ కళేబరాన్ని చేరుకో!' అని పంపేశాడు.

★

# చాతుర్యం

అనగనగా అపురూపపురంలో వీరేశం అనే షరాబు వుండే వాడు. అతనికీ కుమ్మరి కనకయ్యకీ మాంచి స్నేహం. ఒకర్ని విడిచి మరొకరు వుండేవారు కాదు. వీరేశం గొప్పగా మాటల నేర్పు గలవాడు ఎదుటివార్ని మాటలతో పట్టి వుంచటంలో అతనిదే పై చేయి. అందుకేనేమో, కనకయ్యకి వీరేశమంటే, ఒక ప్రత్యేకమైన అభిమానం, గౌరవం వుండేవి.

ఒకనాడు ఈ స్నేహితు లిద్దరూ కాలవగట్టుకు పోయి తిరిగివస్తూంటే కనకయ్యకి యేదో ప్రశ్న అడగ బుద్ధి పుట్టింది.

"వీరేశం! మీ వంశంవాళ్లంతా మాంచి చాతుర్యం, నేర్పు, గల వాళ్ళని అందరూ అనుకుంటారు. మరి, నీలో అవి కనిపించవేం?" అన్నాడు కనకయ్య. వీరేశం మెల్లగా నవ్వాడు.

"అవుతే నా చాతుర్యం కూడా చూడాలని వుందన్న మాట... నేను చెప్పినట్టు చేస్తావా?" అన్నాడు వీరేశం.

"ఏమిటో చెప్పు. తప్పక చేస్తాను."

"మీ యింట్లో బంకమట్టికి కొదవలేదుకదూ! అంచేత మట్టి రూపాయలు తయారుచెయ్యి. రోజుకి కనీసం వంద య్యేట్టు చెయ్యి. అవన్నీ నీదగ్గరే వుంచు. ప్రతిరోజూ మొత్తం యెన్నవుతు న్నవీ నాకు తెలియజేస్తూ వుండాలి. మరొక విషయం......ఈ రహస్యం మరెక్కడా పొక్కనివ్వ కూడదు" అన్నాడు వీరేశం.

తన స్నేహితుడు యేంచెయ్య నున్నాడో, కనకయ్యకి ఒక పాళాన అర్థమయ్యింది కాదు. ఎక్కడా పొక్కనివ్వొద్దన్నాడూ అంటే యేదో గమ్మత్తు యిమిడివుందన్న మాట - అనుకున్నాడు...

ముద్దంశెట్టి హనుమంతరావు

"అలాగే వీరేశం...రేపే మొదలుపెడతా" అన్నాడు. తరువాత యిరువురు స్నేహితులు యెవరింటికి వారు పోయారు.

* * *

స్నేహితులంతా ప్రతిరోజూ సాయంత్రమయ్యేసరికి వూరి మధ్య వున్న నావఠాయిపై సమావేశమవ్వటం సాధారణంగా జరిగేది. వీరేశం కనకయ్యకి సలహా యిచ్చిన మూడో రోజుకూడా అంతా చేరారు. అందరూ వింటుండగానే వీరేశం అడిగాడు.

"ఏమోయ్ కనకయ్యా! యీ వాల్టికి మొత్తం యెన్నిరూపాయిలు?" అని. "మూడు వందలయ్యాయ్" చిరునవ్వుతో జవాబిచ్చాడు కనకయ్య. "బావుంది...అలా నీదగ్గరే వుండనియ్" అంటూ వీరేశం తక్కిన వాళ్లతో యితర సంభాషణ మొదలు పెట్టాడు.

రూపాయిల విషయం వినేసరికి అక్కడున్న వారిలో కొందరికి అదేమిటో తెలుసుకోవాలని అభిలాష పుట్టింది కనకయ్యని అడిగి చూశారు...వీరేశంని అడిగారు. కాని లాభం శూన్యం.

ఇలా ప్రతిరోజూ వీరేశం, నావఠాయిపై నలుగురు స్నేహితులు కూచున్నప్పుడే కనకయ్యని అడిగేవాడు రూపాయిల విషయం. కనకయ్య వుత్సాహంతో అంతవరకు తను తయారుచేసిన మట్టి రూపాయల మొత్తం చెప్పేవాడు.

పదిరోజులు దాటాయి. రోజుకి నూఱు చొప్పున చేసేవాడు గనుక పదోనాటి సాయంత్రానికి అతని దగ్గర వెయ్యి రూపాయిలు(మట్టివి) వున్నాయన్నమాట.

పదోరోజు సాయంత్రం స్నేహితులందరి సమక్షంలో వీరేశం అడిగాడు.

"ఏమోయ్ కనకయ్యా! మొత్తం యెన్ని రూపాయలయ్యాయ్ యింతవరకు?" అని.

"వెయ్యి సరిగ్గా అయ్యాయ్ వీరేశం" జవాబిచ్చాడు కనకయ్య. వీరేశం చిన్నగా నిట్టూర్చి

"అబ్బ! ఇప్పటికయినా నా పట్టుదల నెరవేరింది. ఎలాగవుతేనేం, వెయ్యి రూపాయలు అట్టే పెట్టగలిగాను. కనకయ్యా! నీదగ్గర దాపరికం ఇక చాలు. నా వెయ్యిరూపా

యిలు నాకు పారెయ్యి...ఇంతవరకు భద్రంగా దాచినందుకు కృతజ్ఞుణ్ణి" అన్నాడు.

అక్కడున్న వాళ్ళందరికీ అప్పుడర్థమయ్యింది స్నేహితు లిద్దరి రూపాయల లెఖ్ఖలు. 'వీరేశం కనకయ్యదగ్గర దాస్తున్నాడన్నమాట' అనుకున్నారు.

"తీసుకుపో...మట్టి రూపాయి లేగా-నాకేం!" నవ్వుతూ అన్నాడు కనకయ్య.

స్నేహితులంతా మొహాలు చూసుకున్నారు ఆశ్చర్యంగా. వీరేశంమ్మాత్రం నవ్వలేదు. మొహం అదోలా పెట్టి "పరిహాసాలకిది సమయంకాదు కనకయ్యా! నా రూపాయిలు నాకిచ్చేయ్...వీళ్లంతా నిజంగా అవి మట్టి రూపాయలే అనుకోగలరు. అప్పుడే నేనొక పొలం బేరమాడానుకూడా...కొనుక్కోవాలి" అన్నాడు.

"ఏవిటోయ్ వీరేశం, మీగొడవ మాకేమీ అర్థంకాకుండావుందే?" అన్నాడొక స్నేహితుడు. వీరేశం చెప్పటం మొదలుపెట్టాడు.

ఏముంది వీరన్నా! యీ మధ్య నేను బంగారం వర్తకం చేశాన్లే. మహజోరుగా సాగింది. ఆడబ్బంతా నాదగ్గరుంచటం యెందుకని రోజుకి నూఋ చొప్పున కనకయ్య దగ్గర అట్టేపెట్టేవాణ్ణి. నాదగ్గరుంటే యెందుకైనా ఖర్చయి పోతాయని భయం. ఆ రూపాయిలే యిప్పుడు తెచ్చిమ్మంటుంటే, మనవాడు పరిహాసంలోకి దిగాడు."

కనకయ్య గుడ్లు తేలవేసి తెరచిన నోరుమూయకుండనే,

 చాతుర్యం 

"అదేమిటి వీరేశం! మట్టిరూపాయలు రోజుకి నూఋ చొప్పున చెయ్యమని నువ్వేగా చెప్పావు. నాకు రూపాయి లిచ్చావంటూన్నావేమిటి?" అన్నాడు.

"నీకు మతిగాని పోవడం లేదు కదా! నీవుద్దేశం నాడబ్బంతాయెగ్గొడదామనేనా? ఆ పప్పులు నాదగ్గరుడకవు. వీళ్లంతా లేరా సాక్ష్యం! వీళ్ల ఎదురుగానే కదా, ప్రతిరోజూ లెఖ్ఖ అడిగేవాణ్ణి! నేపాలు వేయకండా నాడబ్బు తెచ్చి పడేయ్" వీరేశం మాటల్లోగాని, మొహంలోగాని మచ్చుకైనా పరిహాసమాడుతున్న సూచనలు అగుపించలేదు.

"ఏమిటి వీరేశం, యిదంతా నిజమేనా? నన్నేడిపించడానికా? "బావుందోయ్... స్నేహితుడివి కదా అని నమ్మితే, యిలా మోసం చెయ్యాలనుకుంటున్నావా? ఇక్కడ తేలే వ్యవహారంకాదు. గ్రామపెద్ద దగ్గరికి పద...మీరంతా కూడా రండోయ్" అంటూ ముందు దారి తీశాడు వీరేశం.

కనకయ్యకి అంతా అయోమయంగా, యేదో అగాధంలో దిగుతున్నట్టుగా అనిపించింది. భారంగా అడుగులు వేస్తూ తతిమ్మా స్నేహితులతో పాటు బయల్దేరాడు. ఈ దుస్థితి అంతా తను కోరి తెచ్చుకున్నట్టే అనిపించింది. వీరేశది, దుర్మార్గానికి మనసులో యెంతగానో తిట్టుకున్నాడు.

అంతా కలిసి గ్రామపెద్ద దగ్గరికి వెళ్లారు. అక్కడ కనకయ్య మొదటినుంచీ జరిగిన కథ పూసగుచ్చినట్టు చెప్పాడు. కాని, అది యెవ్వరూ నమ్మలేదు. కనకయ్య తన డబ్బు యెగగొట్టడానికే ఇలా చెప్తున్నాడని అందరికీ నమ్మకం కలిగించాడు వీరేశం. ఇంకేముంది? సాక్ష్యం వీరేశం వేపే బలంగా వుంది. గ్రామపెద్ద మ్మాత్రం యేంచేస్తాడు? వేయిరూపాయిలు తప్పక యిచ్చుకోవాలని కనకయ్యతో చెప్పాడు.

ఆ సమయంలో కనకయ్య దురవస్థ వర్ణనాతీతం. కుప్పగా కూలిపోయి నెత్తి నోరు కొట్టుకుని యేడవటం మొదలుపెట్టాడు. కాదూ మరి! వెయ్యిరూపాయిలంటే మాటలతో పనా?

గ్రామపెద్ద యింటినుండి అంతా తిరుగుముఖంపట్టారు. వీరేశం కంట తడిపెట్టుకుని ఒంటరిగా నడుస్తున్న కనకయ్య సమీపించి "ఇప్పుడైనా నా చాతుర్యం తెలిసిందా?" మెల్లగా అన్నాడు నవ్వుతూ.

కనకయ్య వళ్లు మండిపోయింది. కోపం అధికమయ్యింది.

"తెలిసిందయ్యా తెలిసింది! ఎలాగవుతేనేం అన్యాయంగా నాకొంప ముంచావుకదా! నన్ను సర్వనాశనం చేశావు. ఇంత దుర్మార్గుడివని నేనెప్పుడూ అనుకోలేదు" అన్నాడు వుద్రేకంగా కనకయ్య.

వీరేశం పెద్దపెట్టున నవ్వాడు. స్నేహితులంతా ఆ నవ్వుకి ఆశ్చర్యపోయి చూస్తున్నారు.

"ఎందుకలా బాధపడతావు? అంతా మర్చిపో కనకయ్యా... చూశావా యెంత నాటకమాడానో! చాతుర్యం వుండాలేగాని ఒక అబద్ధాన్ని యెంతో నిజంగా మార్చవచ్చు...ప్రత్యక్షంగా, అనుభవపూర్వకంగా నువ్వు గ్రహించావు



# రకత-పోకత



"కంగ్రాచులేషన్స్, రావుగారూ" అన్నాను హాలులోనుంచే, మాయింటి వేపు వస్తున్న రావుగారినిచూచి.

"ఏదో నేనే ప్యాసైనట్టు అభినందిస్తున్నారు." అన్నా రాయన, నా కంగ్రాచులేషన్సు నేనికోసమో అర్థమైపోయి

"అదికాదండీ. "పితృః సమో జ్యేష్ఠ" అన్నారు గదా పెద్దలు. మీవాడు అందులోనూ జ్యేష్ఠుడు, పైగా ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడంటే మీకు కాక మరెవ్వరికియ్యాలి కంగ్రాచులేషన్సు!" అన్నాను ఆయనను హుషారు చెయ్యడానికి.

"నిజమే ననుకోండి, అయినా అప్పుడే ఏమయింది? ఇప్పటికి ఇల్లలికినట్టు. పండగంతా ముందరేవుందిగదా? అసలు చిక్కంతా ఇప్పుడే వచ్చింది. ఇంతవరకూ ఏ ఆలోచనా అక్కరలేకుండా సాగిపోయింది వాడి చదువు. ఈ ఇంటరు పూర్తి అయాక దోవలు చీలుతాయిగదా" అని, గొంతు కొంచెము తగ్గించి "అయితే శాస్త్రిగారూ, మనవాణ్ణి ఏ లైనులో పెడదామంటారూ?" అన్నారు రావుగారు నేనొక్కడనే తనకు అపుడైనట్టూ, నా ఆలోచననే శిరసా వహించేటట్టూనూ.

"మరి ఆ ప్రశ్న వేశారు కనుక, దానికి సమాధానం మనం తేల్చాలి, ముందర కొంచెం కాఫీసేవిద్దాం. ఆ తిరువాత ఆలోచన పాదరసం లాగా పరుగెట్టుతుంది." అన్నాను నేను, నా మాటలు లోపలికి వినిపించి శ్రీమతి కాఫీ పంపించాలనే ఉద్దేశంతో.

## కె. వి. వై. శాస్త్రి

రామారావుగారికి యీ సందర్భంలో ఆ ఆనందం ఆ ఉత్సాహం కలగడం సహజమేనని ఒప్పుకోవాలి కుఱ్ఱాడు ప్రసాదు పుట్టినప్పటినుంచీ వాడి భవిష్యత్తునుగురించి ఆయన కలలు కంటూనే ఉన్నాడు. మావాడు నాలాగ తాలూకా గుమాస్తా పని చెయ్యకేవ్. నేను పడ్డట్టుగా వాడు నీచెతి మాటలుపడకా డనుకోను" అనేది అతడు తన భార్యతో చేసే స్టాక్ జోక్. కొడుకు ఒక్కొక్క క్లాసే గెంటుకొస్తూంటే ఆయన ఆశలు కూడా క్రమంగా స్థిరస్వరూపం తాల్చినవి. తాను యెన్ని కష్టాలు పడా సరే, ప్రసాదును పైచదువుకు పంపించాలి. ఆతరువాత వాడు ఏ డాక్టరో ఇంజనీరో అయితే మిగతా కుఱ్ఱాళ్ల పూచీ తనకేమీ అక్కరలేకుండా సంసారాన్ని వాడే ఆదుకుంటాడు. తాను రిటైరయి హాయిగా మనుమళ్ళని ఎత్తుకుంటూ రోజులు గడిపెయ్యవచ్చు" ఇవీ అతని ఆలోచనలు.

నిన్న మొన్నటివరకే సలహా అడిగారే కాని, ఇంటరులో ప్రసాదుకి బై. పి. సి. గ్రూపులో సీటు సంపాదించినప్పుడే ఆయన ప్లాను మాకందరికీ తెలిసిపోయింది. అంతవరకూ ఇంజనీరింగు మీదే దృష్టి ఉన్నా, క్రమంగా దానిమీద మోజు తగ్గి, డాక్టరీయే అటు ఉద్యోగానికీ, యిటు ప్రైవేటు ప్రాక్టీసుకి తగినదనీ, ప్రసాదు డాక్టరే కావాలనీ, ఆయన అప్పుడప్పుడనడం, మేము ఊ కొట్టడం కూడా కద్దు.

"కాఫీ కాలే మా సంప్రదింపుల పర్యవసానం ఏమిటంటే: ప్రసాదును డాక్టరీకే పంపాలి. విశాఖపట్టణం కంటే కూడా మద్రాసయితే విద్యా సౌకర్యాలు బాగుంటాయి. కనుక తనకు ఇంటిదగ్గర కష్టమయినా, మద్రాసు మెడికలు కాలేజీకే పంపించాలి.

భగవదనుగ్రహం వల్ల సీటు కూడా ప్రత్యేక రికమెండేషన్లు ఆట్టే అక్కరలేకుండానే లభ్యమయింది. కాలేజీ తెరవడం, ఇక్కడ ట్రాన్సుఫరు సర్టిఫికేటు తీసుకోవడం, పిల్లవాడి పొరుగూరి మకాముకు కావలసిన సరంజామా చేకూర్చడం, బట్టలు కుట్టించడం, మద్రాసుపరిస్థితులను గురించి తెలిసినవాళ్ళ నందరినీ వాకబుచెయ్యడం, ఈ హడావుడితో పాపంరామారావుగారికి తీరికే లేకుండాపోయింది. ప్రసాదును మద్రాసుకు పంపించవలసినరోజు ఇట్టే వచ్చేసింది.

కొత్తచోటులో, అందులో చెన్న పట్టణంలాంటి బస్తీలో ఎల్లా మెలకువగా ఉండాలో, స్నేహితుల్ని ఎంచుకోవడంలో ఎల్లా జాగ్రత్తపడాలో-ఇలాగ తనకు తోచిన సలహాలన్నీ చెప్పారు రామారావుగారు. అవన్నీ మద్రాసు మహానగర సందర్శన కుతూహలంలో ఉన్న ప్రసాదు సావధానంగా విన్నాడా లేదా అన్నది వేరే సంగతి. "నాయన ఎన్నడూ పొరుగింట భోజనం చేసి ఎరగడు. ఆ ఉప్పూ కారం లేని అరవ హోటళ్లలో అన్నం ఏమి సహిస్తుంద'ని తల్లివాపోయింది. తను చెయ్యగలిగిందింతే నన్నట్టు బలవంతంమీద' ప్రసాదు సామానుల లిస్టులో ఆవకాయజాడీ, కందిపొడుం డబ్బా చేర్పించింది. "అన్నయ్యా, మద్రాసు నించి నాకు ఏం తెచ్చిపెడతావురా? కళ్ళు తిప్పే బొమ్మ మరిచిపోకేం:" అంటూ ప్రసాదు చెల్లెలు రమ, ఏడేళ్లది ఆ రోజల్లా తన కోరికలు ఏకరువు పెడుతూనే ఉంది. నాలుగో క్లాసు చదువుతున్న సోము తనకు కావలసిన రంగుల క్రేయన్ పెట్టె, రంగుల బొమ్మల కథల పుస్తకాలూ, రెండు వైపులా పాళీలుండే కలమూ, ఇత్యాదులన్నీ ఒక కాగితంమీద లిస్టుగ్రాసి, ఆ కాగితం ప్రసాదు పర్సులో స్వయంగా పెట్టాడు. పెద్దలకు నమస్కారాలతోటి, చిన్నలకు ముద్దులతోటి సెలవు చెప్పి ప్రసాదు బయలుదేరాడు.

రావుగారికి మానసికంగా చాలా సంతృప్తి కలిగించిన యీ విషయం, ఆర్థి

---

## ★ చాతుర్యం ★

కదా? నువ్వు నాకివ్వాల్సినవి వర్తీ మట్టి రూపాయిలే" అన్నాడు వీరేశం.

"ఆరి పిడుగా! యెంత గొప్ప నాటక మాడావు?" అంటూ ముక్కుమీద వేలువేసుకున్నారు స్నేహితులంతా.

కనకయ్య దుఃఖాన్నంతా క్షణంలో మర్చిపోయి పొంగుకొస్తున్న ఆనందంతో వీరేశాన్ని కౌగలించుకున్నాడు. "వీరేశం! నీ చాతుర్యం మరెప్పుడూ చూపించబోక" నవ్వుతూ అన్నాడు కనకయ్య. అంతా ఒక్కపెట్టున నవ్వారు.

(బెంగాలీలో చెప్పుకునేకథ)

# ★ రాకడ - పోకడ ★

కంగా మట్టుకు చాలా శ్రమ తెచ్చిపెట్టింది. నలుగురు పిల్లలు, చాలీచాలని జీతం, వేరే ఆసరా తక్కువ. ఈ పరిస్థితులలో కొడుకును ఎమ్. బి. బి. ఎస్. లో చేర్పి నెగడం అంటే తనబోటివాడికి కఠినపరీక్షవంటిదే. అయినా రావుగారు వెనుదీయలేదు. లాబొరేటరీకి అనీ, సైన్సు పరికరాలకు అనీ, స్పెషల్ డ్రెస్‌కి అనీ ఏవో అవసరాలకు డబ్బు కావలసివస్తూనే ఉంది. రావుగారు పంపుతూనే ఉన్నారు. ఒకసారి గాబోలు ఉత్తరం రాగానే సొమ్ము పంపడానికి వీలులేక పదిరోజులు ఆలస్యంచేశారు రావుగారు. దానితో అక్కడ ప్రసాదు తల్లక్రిందులై పోవడం, సమయానికి తన అవసరం తీర్చలేదన్న కోపంతో మానాస్త్రప్రయోగం చెయ్యడం జరిగాయి. పట్నంనించి అబ్బాయిక్షేమం తెలియక కంగారుపడి రావుగారు వారంరోజులు తల్లడిల్లిపోయారు. చివరకు ఒకాయన మద్రాసు వెళ్లుతూంటే ఆయనను ప్రసాదు క్షేమం కనుక్కురమ్మని బతిమాలారు. ఆయనవచ్చి కుర్రాడు నిక్షేపంగా ఫస్టులైన్ బీచ్‌లో షికార్లు కొడుతూ కనిపించాడని చెప్పాక కుదుటపడింది రావుగారి మనస్సు.

మూడు నెలలు పోయాక సెలవులకు ఇంటికి వచ్చాడు ప్రసాదు. ఆ రోజు వాళ్ల యింటికి పర్వదినం. అన్నాయి వస్తాడని రమూ, సోమూ ప్రొద్దుటినించీ తయారయి స్టేషనుకు మేమూ వస్తామని పట్టుబట్టారు. బడినుంచి తిరిగి వచ్చేటప్పటికి అన్నయ్య ఇంటికి వచ్చేసి వాళ్లని షికారుకు తీసుకు వెళ్లుతాడని నచ్చజెప్పి రావుగారు వాళ్లని బడికి పంపించారు.

ప్రసాదు వచ్చాడు. తల్లి వాకిట్లో నిలబడి కళ్లు చేటలంత చేసుకొని, అబ్బాయి రాగానే దిష్టితీసి లోపలికి తీసుకొని వెళ్లింది. "ఇదేమిటే వట్టి మూఘనమ్మకొలూ నువ్వూనూ" అంటూ లోపలికి వెళ్ళాడు ప్రసాదు. కాస్సేపు మద్రాసు విశేషాలు మాట్లాడుకున్నాక తండ్రికొడుకులు భోజనానికి లేచారు. హోటలుభోజనం సరిపడక పోవడంవల్లా, కాలేజీకి దూరమవడంచేతా, లాడ్జి వదిలేసి హాస్టలులో చేరానని చెప్పాడు ప్రసాదు. దీని అర్థం రావుగారికి తెలుసు–తను ఇదివరకు పంపిస్తున్న మొత్తానికి సుమారు రెట్టింపు ఇకముందు పంపవలసి వస్తుందని. అయినా ఆయన పైకి ధీమాగా "పరవాలేదులేరా, నువ్వక్కడ కష్టపడకుండా ఉంటే ఇంటి దగ్గర మేము ఎలాగో ఒకలాగు గడుపుకుంటాం" అన్నాడు.

భోజనం తిన్నగా చెయ్యనేలేదు ప్రసాదు. సాంబారు ఇడ్లీల సంస్కృతంలో తలమున్కలైన కారణాన, అచ్చతెనుగు భోజనానికి అన్నీ వంకలే పెట్టాడు. ఈ బడీ ఉప్పూ కారా లేమిటన్నాడు. అతనిమాటలు వింటూ తల్లి విస్తుపోతూ నుంచున్నది.

రమూ, సోమూ బిలబిల్లాడుతూ స్కూలు నుంచి తిన్నగా ఇంటికి ఒక్కటే పరుగులో వచ్చేశారు. వస్తూనే 'అన్నయ్య వచ్చాడు' అంటూ ఇద్దరూ ప్రసాదుని చుట్టేశారు. అప్పుడే పైజామా పంట్లాము ధరించి విహారార్థము బయలుదేరాడు ప్రసాదు. వీళ్లిద్దరూ తనకాళ్ళను చుట్టేసుకోడంతో అతనికి మహా కోపం వచ్చేసింది. "ఉండండ్రా, ఆ బట్టలూ మీరూనూ. నా పాంట్ మాపేశారు" అని కేకేశాడు. వాళ్ళిద్దరూ బిత్తరపోయి తమబట్టలకేసీ అన్నయ్యబట్టలకేసీ చూశారు. నిజమే, అన్నయ్య బట్టలముందు తమవి బాగా మాసినవే. సోమూ నిక్కరుకు చిన్న చిరుగుకూడా ఉంది. అన్నగారి ఈ మాటలతో హడలిపోయి వాళ్లు తిన్నగా లోపలికి పోయారు. షికారుకు బయలుదేరాడు ప్రసాదు.

తనకు పరిచయమున్న పెద్ద మనుష్యుల దగ్గరకు ప్రసాదును తీసుకు వెళ్ళడం, వాళ్లతో మావాడు మద్రాసులో డాక్టరుకోర్సు చదువుతున్నాడని చెప్పడం, రావుగారికి సరదా. కాని ఆ పనంటే ప్రసాదుకు చిరాకు. దానికి ముఖ్యకారణం తనతండ్రి ఎప్పుడూ అమాసిన ఒక్క కోటుతోనే అందరిదగ్గరకూ వెళ్లుతాడని. అందుచేత ఆయనతో కూడా తను వెళ్ళితే తనకు చిన్నతనంగా ఉంటుందట. ఇది పెద్దదగ్గర పైకి అనకపోయినా, తన బాల్యస్నేహితులతో సణగడం, నేను వినడం తటస్థించింది.

ఒక రోజున మా యింటికి వచ్చాడు ప్రసాదు. సెలవుల్లో తనకెక్కడేమీ తోచటంలేదనీ, ఈ ఊళ్ళో తనకి ఉజ్జీ అయిన టేబుల్ టెన్నిస్ ప్లేయరే కనబడటంలేదనీ, మద్రాసులో జరుగుతూన్న టూర్నమెంట్సు మిస్ అవవలసి వచ్చిందనీ, ఈవూళ్ళో వినోదాలు అనేవే ఏవీ లేవనీ ఏమేమో చెప్పాడు. నన్నుకూడా మా ఊళ్ళోని అనాగరికుల క్రింద జమకట్టుతాడేమోనని అతనితో వాదనకు దిగకుండా విని ఊరుకున్నాను.

సెలవులు పదిహేనురోజులూ గడిచినై. వెళ్ళేనాటికి కావలసిన పైకం రావుగారు ఎలా జమచెయ్యగలిగాడో బ్రహ్మకెఱుక. పొదుపుగా ఖర్చు చెయ్యమని చెప్పితే ఏమి చిన్నబుచ్చుకుంటాడోనని ఆ విషయం ప్రసాదుతో చెప్పడానికి జంకాడు. వెళ్ళేటప్పుడు రిక్షాలో ఇద్దరూ కూర్చున్నప్పుడు చూచాయగా అన్నాడు. "నాయనా, ప్రసాదూ, నీకు లెక్క ఎందుకైనా కావలసివస్తే కాస్త వారంపదిరోజులు ముందుగా వ్రాస్తావుకదూ. వ్యవధిలేకుండా జమ చెయ్యడం కష్టమని నీకూ తెలుసుకదా" అని. కాని యీ మాటలకే కోపము వచ్చినంత పని అయింది ప్రసాదుకు. "నేననవసరంగా నిన్నేమీ బాధపెట్టడంలేదు నాన్నా. ఆ మాటకొస్తే మా కాలేజీలో కల్లా నేనొక్కడనే పులెక్ పాంటు ఒక్కటైనా లేకుండా కాలక్షేపం చేస్తున్నవాణ్ణి." అన్నాడు. పులెక్‌పాంటుకీ మద్రాసు శీతోష్ణస్థితికి ఏమి సంబంధమో ఊహించుకోలేకపోయినా, ప్రయాణసమయంలో ఈ సంభాషణ నింక పొడిగించదలుచుకోలేదు రావుగారు.

నానాటికి అధికమవుతున్న ఖర్చు భరించడానికి మార్గాలు వెదికి రామారావుగారు చివరకొక నిర్ణయానికి వచ్చారు. గోవిందసేటుతో మాట్లాడి తన ఆఫీసు పని అయ్యాక ఒకగంట అతని ఎకౌంటు వ్రాసిపెట్టేటూ నెలకి ఓ యాభైరూపాయలు అతనిచ్చేటట్టూ ఏర్పాటు చేసుకున్నారు. దానితో మనస్సు కొంత కుదుటబడింది, కాని యీ ఏర్పాటు మొదట అనుకున్నంత సులభంగా కనబడలేదు. తనకొ, నలభైఏళ్లు దాటాయి. ఆఫీసునుంచి యివతల పడేటప్పటికే తన వంట్లో శక్తీ బయట ప్రపంచంలో సూర్యుడూ అస్తమించడం జరిగేది. అప్పుడు బయలుదేరి సేటు కొట్టుకి నడిచివెళ్ళడం, ఆ గుయ్యారంలో, ఉక్కపోతలో గంటన్నర సేపు ఎకౌంట్లు వ్రాయడం అయ్యేసరికి దరిదాపు 8 గంటలు కావచ్చేది. నాన్నగారు ఇంకా రాలేదని చూసి చూసి పిల్లలు నిద్రపోయేవారు. ఇంటికివచ్చి కాసిన్ని మెతుకులు నోట్లో వేసుకు వేసరికి మర్నాడు చెయ్యవలసిన పనులూ, బకాయిపడ్డ ఆఫీసు కాగితాలూ, జ్ఞాపకానికి వచ్చి ఆ ఆలోచనలతోటే మంచంమీద వ్రాలి నిద్రపోయేవాడు. ఈ దినచర్య ప్రభావం శరీరంమీద స్పష్టంగా కనబడటానికి ఆట్టే రోజులు పటలేదు. రెండు నెలలిట్లా చేసేటప్పటికి మనిషి చిక్కి సగమైనాడు. చూసినవాళ్లు "ఏమండీ రావుగారూ, ఇల్లా ఉన్నారు? ఈ మధ్యన జబ్బు పడ్డారా" అని అడిగేవారు. ఏదో ఒకటి చెప్పి తప్పించుకునేవాడు.

హాస్టలులో చేరాక ప్రసాదు జీవితంలోకి ఒక క్రొత్త వ్యక్తి ప్రవేశించాడు. అతడు హాసలు ప్రక్కనే కాపురముంటున్న భాస్కరం. భాస్కరంకూడా మెడికలు కాలేజీ విద్యార్థే. ప్రసాదుకంటే ఒకయేడు సీనియరు భాస్కరానికి టేబులు టెన్నిస్ అంటే మహాసరదా. ప్రసాదు ఆ ఆటలో మంచి నేర్పు సంపాదించాడు ఇంట

రులో ఉన్నప్పుడే. ఇప్పుడతను మద్రాసులో ఛాంపియన్ ప్లేయర్లలో ఒకడయి కూర్చున్నాడు. ఈ విషయం భాస్కరం ప్రసాదుల మైత్రికి ముఖ్య కారణమైంది.

జీవితపు విషమసమస్యలు, ఆర్థిక దురవస్థలు ఎంతమాత్రం చవిచూడ నవసరంలేని పరిస్థితి భాస్కరానిది. వాళ్లతండ్రి ఎన్నో కేటువృత్తిలో ఎంతో గడించాడు. ఇంకా గడిస్తున్నాడు. కొడుకును ఎంతో ప్రేమతో చూచుకుంటాడు. అతని టేబిల్ టెన్నిస్ సరదా కనిపెట్టి వాళ్లి హాలులోనే చక్కని టేబుల్ ఏర్పాటుచేసి మంచి ఆటగాళ్లని పిలిపించి విందులు చేస్తూ ఉంటాడు. భాస్కరంద్వారా ప్రసాదుకు వాళ్ల నాన్నగారితో కూడా పరిచయమైంది.

భాస్కరం కుటుంబంతో తనకు పరిచయం కావడం మహాదృష్టం అనుకున్నాడు ప్రసాదు. తనహోదా ఒక్కసారిగా పెరిగిపోయినట్టనిపించిందతనికి. అందులోనూ భాస్కరం కూడా తన స్నేహాన్ని బాగా వాంఛించడం అతనికి మరీ ఉత్సాహాన్నిచ్చింది. కాని వచ్చిన చిక్కల్లా తను వాళ్లతో ఆహార విహారాలలో సరితూగగలడా అనే. ప్రసాదు మనస్తత్వం ప్రకారం అటువంటి ధనికుల స్నేహాన్ని ఎలాగైనాసరే నిలబెట్టుకుని తీరాలి. వాళ్లతో తనూ ఏవిధంగానైనాసరితూగాలి. దీనికోసం అతడు రకరకాల అబద్ధాలుఆడవలసివచ్చేది. తనకు ఆస్తిచాలానే ఉందనీ, ఉన్న ఊరు వదలలేక విలాసార్థము వాళ్లి నాన్నగారు గుమాస్తాఉద్యోగం చేస్తున్నారనీ చెప్పేవాడు. అవతలవాళ్లు ఈవిషయాలు ఆట్టే పటించుకునేవాళ్లు కాకపోవడంచేత ఇతడు ఏం చెప్పినా సరిపోయేది.

టేబిల్ టెన్నిస్ ద్వారా భాస్కరం ప్రసాదుల మైత్రి దినదినప్రవర్థమానమైంది కాలేజి వదలగానే యిద్దరూ భాస్కరం ఇంటికివచ్చి టీ త్రాగడం, ప్రసాదుభాస్కరానికి ప్రాక్టీసుఇవ్వడం, తదనంతరంఇద్దరూ కలిసి స్పిన్ సర్వీసుని ఎల్లా మీట్ కావాలో బ్యాక్ హాండ్ షాట్ కి సరియైన పొజిషన్ ఏమిటో ఇత్యాదివిషయాలు చర్చించుకుంటూ క్లబ్ కో షికారుకో వెళ్లడం ప్రసాదు దినచర్యలో ముఖ్యవిషయాలైనాయి.

"అసమానులమధ్య మైత్రిఅయితే వారిలో తక్కువతరహా వారికన్నీ ఇబ్బందులే" అన్నాడు గోల్డుస్మిత్. ప్రసాదు తరుచు అటువంటి పరిస్థితుల్లో పడేవాడు. ఇద్దరూ కలిసే సినిమాలకూ, ఎగ్జిబిషన్ మాచెస్ కూ వెళేవారు. ఎప్పుడూ భాస్కరం ఖర్చుతోనే తాను వెళ్లడం తనకే చిన్నతనంవేసి మధ్య మధ్య తానే అతనికి ఖర్చు చెయ్యవలసివచ్చేది. భాస్కరానికి ఎంతో సామాన్యంగా కనబడే ఖర్చు యితని బడ్జెట్టును తలక్రిందులు చెయ్యగలిగినంతదిగా ఉండేది. ఇటి పరిసితుల్లో అతడు ఎక్కువ డబ్బు కావాలని మాటిమాటికీ తండ్రికి వ్రాయక పాపం ఏం చేస్తాడు?

నిజానికి ఇప్పుడు రావుగారికి ప్రసాదు వ్రాసే ఉత్తరాలన్నింటికీ ఆదిమధ్యాంతాలు ఒకటే. తను కులాసాగానే ఉంటున్నాడని మొదలు ఈ నెల ఏవో ప్రత్యేక ఖర్చులు వచ్చినవని వివరణ. కనుక గతసారికంటె ఎక్కువమొత్తం పంపవలసి ఉంటుందని ముగింపు. రావుగారికి ప్రసాదు చదువును గురించి మోజు తగ్గిపోయిందనలేముగాని, ఇదివరకున్న ఉత్సాహం కనబడటంలేదని గ్రహించవచ్చు. సేటుదగ్గర అడ్వాన్సుగా పుచ్చుకున్న మొత్తమే యిప్పటికి 300 ఉన్నది. అయినా మంచివాడు గనుక అడగగానే లేదనకుండా యిస్తూ "అబ్బాయి చదువుకోసం అడుగుతున్నారుగాని దుబారా ఖర్చుకి కాదుగదా. పర్వాలేదు. తీసుకువెళ్లండి" అనేవాడు. కాని తనకుమాత్రం అనిపించేది, యీమూడు వందలూ తీర్చడమంటే ఈ సాయంకాలపు చాకిరీ యింకా ఆరునెల్లు చెయ్యాలికదా అని.

మార్చినెల దగ్గరకి వచ్చింది. దురదృష్టవశాత్తు రావుగారికి వంట్లో నలత ప్రవేశించింది. అధిక ప్రయాసవలన ఆయనకు గుండెదడ ప్రారంభమయింది. డాక్టరు దగ్గరకు వెళ్ళితే ఆయన రెస్టు కావాలని సలహా యిచ్చాడు. కాని ఆ రెస్టు ఎల్లా వస్తుంది? సాయంత్రం గోవిందసేటు దగ్గర పని చెయ్యకపోతే ఆ మొత్తం ఎలాగ వస్తుంది? అది వస్తున్నా తాను నెగ్గే ఎత్తు కనబడటంలేదే. ఆపని మానేస్తే యింక చెప్పేదేమిటి? అబ్బాయికి సెలవులు దగిరకి వచ్చాయిగదా, ఏప్రిలు వరకూ యీడిస్తే ఆ తరువాత రెండు నెలలు రెస్టు తీసుకుందామని నిర్ణయానికి వచ్చాడు చివరికి.

కాని ఆ మర్నాడే ప్రసాదు దగ్గరనుంచి పిడుగులాటి ఉత్తరము వచ్చింది. వాళ్ళ కాలేజీవాళ్లు సెలవులలో ఎక్స్కర్షన్ కు వెళ్ళుతారట దక్షిణ హిందూదేశమంతా తిరిగి, బొంబాయి వెళ్ళి అక్కడఉన్న హాస్పిటల్సు దర్శించి, అక్కడనుంచి అజంతా, ఎల్లోరాలు చూసుకుని హైదరాబాదు మీదుగా తిరిగి వస్తారట. కనుక తాను సెలవులివ్వగానే యింటికి రావడానికి వీలుండదనీ, వెంటనే ఖర్చులకుగాను కనీసం రెండువందలు పంపవలసిందని వ్రాశాడు.

అంతకు వారం రోజులకు ముందే హాస్టలు బిల్లు కోసం ఎనభై పంపడంచేత రావుగారికి ఏం చెయ్యాలో తోచింది గాదు. తనను తానే నిందించుకున్నాడు పాపం ఆయన. చాలీచాలని రాబడితో కొడుకును పెద్ద చదువులో దింపి అతని అవసరాలకు సరదాలకు అడ్డువస్తున్నానేమోనని ఒకసారి నొచ్చుకుంటాడు. మళ్ళీ ఒకసారి, కొడుకు మాత్రం కొంచెం తనపరిస్థితి గమనించవద్దా అనుకుంటాడు. ఇప్పుడు ఒక్కసారి రెండువందలు ఎక్కడనించి తేవడం? గోవిందసేటుని అడిగాడు ఆ సాయంత్రమే. కాని అతడు మొండి చెయ్యి చూపించాడు. చిన్నప్పటి నుంచీ గారాబంగా పెంచిన ప్రసాదుకు డబ్బులేదని తెగించి వ్రాయలేకపోయాడు పాపం రావుగారు.

ఆ రాత్రి రావుగారికి జ్వరము వచ్చింది. రావడంలోనూ ఉధృతంగా 104 డిగ్రీలతో వచ్చింది. రావుగారి భార్య చాలా ఖంగారుపడింది. మర్నాడు ఎలాగో ఒకలాగు ముప్పై రూపాయలు జమచేసి ప్రసాదుపేర పంపించిందావిడ. టెలిగ్రాం మని యార్డరులో "లెటర్ ఫాలోస్" అని మాత్రమే వ్రాయిం

## తాడితల తన్నిన వాడితల తన్నిన

క్రాస్ ఎగ్జామినేషన్‌లో అసాధ్యుడని పేరుపొందిన న్యాయవాది ప్రతివాదిని అడిగాడు:

"నీకు పెళ్ళయిందా?"

"ఆ"

"ఎవరితో?"

"మామూలుగానే, ఆడదానితోనే," అని ప్రతివాది తలతిక్కగా సమాధానంచెప్పాడు.

న్యాయవాది నవ్వుతూ "అలాగా? మగవాళ్ళనికూడ పెళ్ళిచేసుకునే వాళ్లుంటారేమిటి?" అన్నాడు.

"ఎందుకులేరు, ఉంటారు"

"ఒక్క ఉదాహరణ చెప్పు చూద్దాం."

"మా చెల్లెలు" అని ప్రతివాది సమాధానం.



'కళోదయా' వారు ఇటీవల మద్రాసు సౌందర్య మహల్‌లో ప్రదర్శించిన పునర్జన్మ నాటకంలో నాయికగా నటించిన శ్రీమతి కృపజ్యోతి

# రాకడ - పోకడ

చింది విడిగా తనొక ఉత్తరం వ్రాసింది. అందులో తండ్రిగారి పరిస్థితి చూచాయగా తెలియజేస్తూ ప్రస్తుతం ఎక్కువ సంపదానికి వీలు పడలేదనీ త్వరగా యింటికి వచ్చి ఆ తరవాత అవసరమైతే అక్కడనుంచే ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళవచ్చునని సానునయంగా వివరించింది.

మద్రాసులో ప్రసాదు పరిస్థితి వేరు. అసలు సంగతి ఏమిటంటే వాళ్ళ కాలేజీ వాళ్లు ఎక్స్‌కర్షన్ ఏదీ ఏర్పాటు చెయ్యనే లేదు. భాస్కరమే అతనితో అన్నాడు ఎండాకాలము బెంగుళూరులో గడిపి వద్దామా అని. 'ఓ, దానికేం" అన్నాడు ప్రసాదు ధీమాగా. కాని ఖర్చు సంగతో? తన ఖర్చులు కొన్ని భాస్కరమే భరిస్తాడని తెలుసును గాని, దర్జాకి లోటు రాకుండా తను గూడా ప్రవర్తించాలి కదా! అందు చేత ఎక్స్‌కర్షన్ ఒకటి కల్పించి డబ్బుకోసం ఇంటికి వ్రాశాడు ప్రసాదు. తాము వెళ్లదామనుకున్న రోజు దగ్గరకు వచ్చేస్తోంది. మనియార్డరు కోసం ఎదురు చూస్తున్నాడు ప్రసాదు.

కాని అయిదు రోజులు పోయాక 30 రూపాయల మనియార్డరు రావడం చూచి మండి పడ్డాడు ప్రసాదు. తనను బొత్తిగా పల్లెవాడి క్రింద కట్టేశాడన్న మాట తండ్రి! ఆ కోపంలో మనియార్డరు కూపన్ కూడా చదవకుండా దాన్ని తిరగగొట్టేశాడు. ఆ మరునాడే తాము బయలుదేరవలసిన రోజు. వచ్చిన మనియార్డరును తిరిగి పంపించేశాడే గాని మరి డబ్బు సంగతి యెలాగు? చివరకు, హాస్టలు బిల్లు కట్టడం మానేసి ఆ డబ్బు తనతో తీసుకు వెళ్ళి తరవాత సంగతి నెమ్మదిగా ఆలోచించవచ్చుననుకొన్నాడు. మరునాటిరోజున భాస్కరం, తనూ కలిసి బెంగుళూరు బయలు దేరారు.

మనియార్డరు తిరిగి వచ్చేసరికి ఇంట్లో వాళ్లంతా కంగారు పడ్డారు. అసలు రావు గారికి జ్వరం మరీ హెచ్చుగా ఉన్నది. ఇంట్లో వాళ్ళు తెలియనియ్యకూడదనుకున్నా, మనియార్డరు తిరిగివచ్చిన సంగతి తెలిసింది ఆయనకు. "గోవిందసేటుకి చీటీ రాస్తాను. వెంటనే వాడికి కావలసిన డబ్బు తీసుకుని పంపండి" అంటూ మంచంమీద నించి లేవబోయారు రావుగారు. అతికష్టం మీద ఆయనను లేవనీయకుండా ఆపుచేసి, తాము ఎలాగైనా డబ్బు సమకూర్చి పంపుతామని హామీ యిచ్చారు ఇంట్లోవాళ్ళు, పొరుగువాళ్ళును.

ఆ సాయంత్రానికి రావుగారికి పరాకు మాటలు ప్రారంభమైనాయి. "ప్రసాదు ఇంకా రాలేదూ? డబ్బుకేం పరవాలేదురా ప్రసాదూ. సేటుజీకి ఇప్పుడే చీటీ రాశానులే. ఆ వూళ్ళన్నీ వెళ్ళి యిక్కడికిరారా. అంతవరకూ నేనెక్కడికీ పోనులే" అంటూ వెర్రిగా మాటాడడం మొదలుపెట్టాడు.

రావుగారి భార్యకు భయం వేసింది. నేను వాళ్లయింటికి వెళ్ళేటప్పటికి ఆవిడ నన్ను చూసి దుఃఖంపట్టలేక బావురుమంది. ప్రసాదును గురించి పలవరింతలతో, ఈ లోకంలోనే ఉన్నట్టు లేరు రావుగారి ధోరణి చూస్తే. వెంటనే బయలుదేరి సేటుదగ్గరికి వెళ్ళి ఆయన అవస్థ చెప్పి వందరూపాయలు తెచ్చాను. తెచ్చి ప్రసాదు హాస్టలు అడ్రసుకు టెలిగ్రాం మనియార్డరు చేస్తూ టెలిగ్రాంలో తండ్రిగారికి బాగా జబ్బుగా ఉందనీ, వెంటనే బయలుదేరి రావలసిందనీ కూడా చేర్చాను.

మనియార్డరు హాస్టలుకి చేరింది కాని ప్రసాదు అప్పటికే బెంగుళూరు చేరాడు. మనియార్డరును భాస్కరంగారింటికి పంపించారు వార్డెన్‌గారు, ప్రసాదు ఆచోకీ అక్కడ తప్పక తెలుస్తుందనే ఉద్దేశంతో. భాస్కరం తండ్రి వెంటనే దాన్ని బెంగుళూరుకు రీడైరక్టు చేశారు.

బెంగుళూరు వెళ్ళిన నాలుగోరోజుకి మనియార్డరు ప్రసాదుకు అందింది. డబ్బు వచ్చినందుకు సంతోషించడానికి లేకుండా టెలిగ్రాంలో విషయాలు అడ్డుపడ్డాయి. ప్రసాదు మొదట విసుక్కున్నాడు. తనను ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళకుండా చెయ్యడానికి ఇదొకవంక గాబోలు అనిపించిందతనికి. చివరకు ఇంటికి వెళ్లడానికే నిశ్చయించుకున్నాడు. తండ్రి వంట్లో జబ్బుమాట నిజం కాకపోతే ఇంటినుంచి స్వయంగా కొంత డబ్బు తీసుకురావచ్చును, పట్టుబట్టి—అనుకున్నాడు ప్రసాదు. భాస్కరాన్ని కూడా తమ ఊరు రమ్మన్నాడు. ఇద్దరూ బయలుదేరారు ఆ సాయంత్రమే.

రావుగారికి పలవరింతలు ఎక్కువయ్యాయి. పగలూ రాత్రీ కూడా తలక్రింద ఐస్ పెట్టిస్తున్నాడు డాక్టరు. రిక్షాలోనించి దిగి త్వరగా రావుగారి గదిలోకి వచ్చాడు ప్రసాదు. ప్రతిఒక్కరూ ఊపిరి బిగపట్టుకుని అతనితో కూడా వచ్చారు. "ప్రసాదు వచ్చాడండీ, ఇదుగో" అంది అతని తల్లి. రావుగారిచ్చిన సమాధానం ఇది.

"ప్రసాదు ఇంకా రాలేదూ? ఉండు నేనే వెళ్తాను వాడికోసం"

అంతే ఆ మరుక్షణమే రావుగారు బయలుదేరిపోయారు మహాప్రస్థానానికి ★

## 'దివినుండి భువికి'

సంపాదకుడు ఆఫీసులో కూర్చుని ఏదో వ్రాసుకుంటూండగా టెలిఫోను మోగింది. అవతలి వ్యక్తి చాలా కోపంగా "ఏమండీ, నేను చచ్చిపోయానని మీరు పత్రికలో వేశారే?" అని అడిగాడు.

"అలాగా. ఇప్పుడు ఎక్కణ్ణించి మాట్లాడుతున్నారు మీరు?" అని సంపాదకుడు అడిగాడు.

## విక్రమార్కుడి 'మార్కు' వాడు

ఉద్యోగంకోసం వచ్చిన కార్మికుణ్ణి మేనేజరు ఇంటర్వ్యూ చేస్తూ ఇలా అడిగాడు:

"నీ వయస్సు"

"నలభై సార్."

"ఎంత కాలంనుంచి పని చేస్తున్నావు?"

"యాభైఏళ్ళు సార్."

"అదేమిటి? నీ వయస్సు నలభయ్యేగా?"

"మిగతాది ఓవర్ టైమండి."

# వనితా లోకం

## స్త్రీలకు ప్రత్యేకవిద్య అవసరమా?

“సుమారు రెండు శతాబ్దాలు విదేశీయులు మనదేశాన్ని పాలించి, మన సంస్కృతిని, నాగరికతను అణగద్రొక్కి పాశ్చాత్య నాగరికతను, ఆధునిక విద్యావిధానాన్ని మనమీద బలవంతంగా రుద్దినా, హిందూమతం నశించలేదు. విదేశాలలో సుమారు ఒక శతాబ్దిపాటు సమరం సాగించి, సాధించిన స్త్రీస్వాతంత్ర్యం భారత మహిళలకు అతి సులభంగా లభించింది. భారత స్త్రీలకు మతంలోగల విశ్వాసం, వారి సదాచార సంపన్నతా దీనికి కొంతవరకు కారణాలు. స్త్రీలు గృహపాలన చేస్తూ, మతాన్ని, సదాచారాలను కాపాడి రక్షించారు. ఇప్పుడు మన దేశంలో, స్త్రీలు ఉన్నత విద్యాభ్యాసం చేసి, గొప్ప గొప్ప డిగ్రీలు పొందుతున్నారు. అన్ని రంగాలలో ప్రవేశం కలిగించుకొంటున్నారు. కాని స్త్రీ పురుషుల మధ్య విద్యావిధానంలో కొంత వ్యత్యాసం ఉండాలి. స్త్రీ పురుషుల జీవితాలలో బాధ్యతలు, విధులు వేరు వేరు కనుక, విద్యా విధానం కూడా వాటి ననుసరించే ఉండాలి. ఈ దృక్పథంతో స్త్రీ విద్యా విధానంలో గృహ సంబంధమైన విజ్ఞానాన్ని చేర్చవలసి ఉంటుంది. ప్రతిరాష్ట్రంలోనూ స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు ఏర్పడి, గృహపాలన, శిశుపోషణ, పశుపాలన, గృహవైద్యం మొదలైన వాటిలో పరిజ్ఞానాన్ని కలిగించాలి,” అని ఒక మహిళా కళాశాల ప్రిన్సిపాల్ ఉపన్యసించినట్లు ఈ మధ్య పత్రికలు ప్రకటించాయి.

మనదేశంలో స్త్రీవిద్యావశ్యకతను గుర్తించినప్పటినుంచీ, స్త్రీకి ఎటువంటి విద్య అవసరమన్న విషయం చర్చకు వస్తూనే వున్నది. ఈ విషయంలో భిన్నాభిప్రాయాలు కూడా బయలుదేరాయి. ‘ఆదర్శగృహిణిగా, మాతగా స్త్రీని రూపొందించగల విద్యే స్త్రీకి అవసరం. కనుక స్త్రీవిద్యావిధానం ప్రత్యేకంగా ఉండవలసిన దే’నని అనేకులు అభిప్రాయపడ్డారు. వీరిలో విద్యావేత్తలు, విద్యామంత్రులు, విద్యాధికారులు, అనుభవజ్ఞులుకూడా ఉన్నారు.

“మేధస్సును వికసితపరచి, భావస్ఫురణం కలిగించే విద్య స్త్రీలకు అనవసరం. స్త్రీ జీవితం ఈరకపు విద్యాభిరుచులకు అనుభవయోగ్యమైనది కాదు. విశాలదృష్టితో ఏర్పడిన కళాశాల విద్యావిధానంవల్ల స్త్రీలకు లాభం కలుగకపోగా హానికరం కూడాను” అని కొందరు అభిప్రాయపడుతున్నారు.

‘స్త్రీని గృహిణిగా మాతగా నిర్ణయించింది సంఘం కాదు, ప్రకృతి. సంఘం దానికనుగుణమైన కట్టుబాట్లను ఏర్పరచింది. ఆమె విద్యావ్యాసంగం, అభిరుచులు, సాంఘిక సంబంధాలు ఆమె జీవిత బాధ్యతలను నిర్వహించటానికి తోడ్పడేవిగా ఉండాలి. ఇతర విధాలైన ప్రయోజనాలను సాధించడానికి స్త్రీ జీవితంలో అవకాశాలు లేవు గనుక, కళాశాలలో కూడా స్త్రీలకు సతీత్వం మాతృత్వం మొదలయినవి మాత్రమే నేర్పాలి!

వాస్తవంగా స్త్రీ జీవితంలో సతీత్వం అసమానమైనది. ఈ స్థానం ఆక్రమించటానికి వ్యక్తుల స్వభావ పరిశీలనానుభవం గృహపాలనం ఆర్థిక సాంఘిక పరిజ్ఞానం స్త్రీకి ఎంతైనా అవసరం. స్త్రీ ఆదర్శవంతంగా గృహపాలన చేయగలిగితే, ఆ అనుభవంతో సహకారంతో పురుషుడు ముల్లోకాలనూ జయించుకొని రాగలడు. అతడి శక్తి సామర్థ్యాలకు ఉద్దీపనం కలిగించేది స్త్రీ. ఆమె మనస్సును గృహంమీద, భర్తమీద కేంద్రీకరించినప్పుడు గాని, సాంసారికాభివృద్ధి సక్రమంగా జరగదు. ఈ అంశాన్ని ఎవరూ కాదనలేరు.

బిడ్డలను కనగానే, స్త్రీ బాధ్యత తీరదు; కడుపులోకి ఆహారం, ఒంటికి గుడ్డా సమకూర్చుకొన్నంత మాత్రాన కూడా ఆ బాధ్యత పూర్తికాదు. బిడ్డలకు విద్యాబుద్ధులు గరపవలసి ఉంటుంది. ఈ విద్యాబుద్ధులు అన్నవి శక్తికొద్దీ శ్రమించి, బిడ్డలకు నేర్పవలసినవి, బిడ్డలకు స్వభావరీత్యా ఉన్న గుణాలకు కాలానుగుణమైన చక్కని రూపురేఖలు దిద్దవలసి ఉంటుంది వారి స్వశక్తులు సద్వినియోగపడే సాధనలు చేకూర్చాలి. అందుకు తగిన అవకాశాలను కల్పించాలి; తల్లులు తమ శక్తికొలదీ దోహదమివ్వాలి.

పుట్టుకతో రానిది పెంపకంవల్ల కలుగని మాట నిజమే. కాని, పుట్టుకలో అస్పష్టముగా ఉన్న స్వభావగుణాలు స్పష్టమయే కాలంలో, తగిన వాతావరణం కల్పించి, వాటి సంపూర్ణవికాసానికి దోహద మివ్వవలసి ఉంటుంది. స్త్రీకి తల్లిగా, భార్యగా ఉన్న బాధ్యతలు ప్రపంచంలోని ఏ ఇతర బాధ్యతలతోనూ పోల్చరానివి; అద్వితీయం, అసమానం అయినవి ఈ విషయంలోకూడా ఎవరికీ అభిప్రాయభేదాలు ఉండవు.

కాని నేటి స్త్రీ యింతటితో తృప్తి చెందదు. ఆమె తన శక్తిసామర్థ్యాలు వివి



# వనితలకు ఒక విజ్ఞప్తి



* జాతి సంస్కృతిని, సభ్యతను నిర్ణయించడానికి సామాజిక జీవితంలో స్త్రీలకు లభించే గౌరవాన్ని ప్రతిపత్తిని కొలబద్దలుగా తీసుకోవచ్చు. అన్ని రంగాలలో పురుషులతో బాటు స్త్రీలకుకూడా సమానత ఉన్నప్పుడే, సమాజం అత్యున్నతదశ పొందగలుగుతుంది. ప్రపంచంలోని పురోగామి దేశాలన్నీ ఈ ఆదర్శంవైపే సాగిపోతున్నాయి

* తరతరాలుగా ఇరుల తెరలలో మాటుమణిగి ఉన్న భారతీయవనిత ఇప్పుడిప్పుడే వెలుగులవైపు దృక్కులు సారిస్తున్నది. పురుషునితో సమానంగా అన్ని రంగాలలోనూ ముందంజ వేస్తున్నది. నిస్సహాయతకు ముఖ్యకారణమైన ఆర్థిక దాస్యంనుంచి బయటపడి, ఆస్తిహక్కులు సంపాదించుకున్నది. ఈ మహత్తర అనివార్య పరిణామంలో స్త్రీలను అనేక సమస్యలెదుర్కొంటున్నాయి.

* అటు పాఠశాలల్లో, ఉద్యోగాలలో, ఇతర సాంస్కృతిక రంగాలలో, ఇటు గృహనిర్వహణ, పిలల పెంపకం, ఆరోగ్యరక్షణ, సాంసారిక సామరస్యం మొదలైనవాటిలో స్త్రీలు ఎదుర్కొనే సమస్యలను, వాటి పరిష్కారానికి అనువైన సూచనలను సాకల్యంగా చర్చించే వ్యాసాలను, వాటితోపాటు రచయిత్రుల చిత్రాలను ప్రకటించడానికి "ఆంధ్ర వారపత్రిక" కుతూహలపడుతున్నది.

★ స్త్రీల సమస్యలు, వాటి పరిష్కారమార్గాలు స్త్రీలకు తెలిసినంతగా పురుషులకు తెలియవేమో. అందుచేత తమతమ అభిప్రాయాలను వ్యాసరూపంలో స్పష్టంగా, సంగ్రహంగా వ్రాసి తమ ఫోటోలతోసహా పంపవలసిందని స్త్రీలకు మా విజ్ఞప్తి. వనితాలోకం శీర్షికకు అని స్పష్టంగా వాటిమీద వ్రాయండి.

★ ఇవేగాక, తీరికసమయాలలో స్త్రీలు ఇళ్ళలో కాలక్షేపానికిగాని, ఆర్థనాదృష్టితోగాని, కుటుంబ ఉపయోగంనిమిత్తంగాని చేయదగిన అల్లికలు, కుట్లు, వంటకాలు ఇతరగృహ పరిశ్రమలు మొదలైనవాటికి సంబంధించిన వ్యాసాలుకూడా పంపగోరుతున్నాము.

—సంపాదకుడు.

## ★ స్త్రీలకు ప్రత్యేక విద్య అవసరమా? ★

యోగపడే అవకాశాలను పరిమితం చేయటాన్ని ఆమె సహించదు. తనకు పురుషుడితో సరిసమానంగా పురోగమించగల సామర్థ్యం ఉన్నదని అన్ని రంగాలలో అనేకమార్లు నిరూపించింది. ఆ విధంగా పురోగమించటానికి తనకు అధికారం, స్వాతంత్ర్యం కావలెనని సమరం సాగించింది. రాజకీయంగా ఆర్థికంగా స్వత్వాలను సంపాదించ కలిగింది సాంఘికంగా పురోగమించింది. వైజ్ఞానికంగా ముందంజ వేసింది.

భారత రాజ్యాంగచట్టాన్ని అనుసరించి, స్త్రీ పురుష వ్యత్యాసం లేకుండా, అన్ని ఉద్యోగాలలో పురుషుడితో పాటు సమానంగా ప్రవేశం కావలెనని కోరుతున్నది.

ఇటువంటి ఆశయాలుగల స్త్రీకి విద్యావిధానం ప్రత్యేకంగా ఒక గృహ సంబంధమైన విజ్ఞానానికి పరిమితం చేయదలచుకోవటంవల్ల, ఆమె పురోభివృద్ధిని అరికట్టటం కాదా?

వ్యక్తిస్వాతంత్ర్యంగల ఈ రోజులలో గణితశాస్త్రంలో ప్రావీణ్యం సంపాదించగల మేధావికి గృహ విజ్ఞానం మాత్రమే బోధించినట్లయితే, ఆమె పురోభివృద్ధికి అవరోధం కల్పించినట్లేకదా? వైద్యురాలయి తన శక్తికి, సునిశితమయిన బుద్ధికి తగిన ప్రజ్ఞ సంపాదించి నారీలోకానికి సేవచేయ బూనుకొన్న వనితకు శిశుపోషణమాత్రమే గరపినట్లయితే, ఆమె ఆశయాలను అరికట్టినట్లే కదా?

స్త్రీలకు సంబంధించిన చట్టాలను వారి అభ్యుదయదృష్ట్యా సవరించి తగిన రక్షణలను కల్పించటానికి న్యాయవాదుల సంఖ్య స్త్రీలలో తక్కువగా ఉన్నది.

తమజాత్యభివృద్ధికోసం న్యాయశాస్త్రం అభ్యసించటానికి దగిన అవకాశాలు లేనట్లయితే, వారికది లోపమేకదా? ఉన్నత విద్య నేర్చి సకల శాస్త్రాలలో పరిచయం కలిగించుకొని, విజ్ఞానానుభవం గడించదలచిన స్త్రీకి ఈ విధానంవల్ల అవకాశాలు పరిమితిమై, శక్తిసామర్థ్యాలు నిరుపయోగమవ్వతాయిగదా?

స్త్రీ పురుషభేదాన్నిబట్టి, జీవితాభిరుచులలో తేడాఉన్నా, వారి శక్తి సామర్థ్యాలనుబట్టి పురోగమించటానికి తగిన అవకాశాలు శ్రేయోరాజ్యంలో వాంఛనీయమనే సంగతి విస్మరటానికి వీలులేదు.

స్త్రీలకు కళాశాల విద్యావిధానం ఏవిధంగా ఉండవలెనో నిర్ణయించవలసినది విద్యావేత్తలు, విద్యాధికారులు, అనుభవజ్ఞులు అన్నమాట వాస్తవమే ఇది విశాల దృక్పథంలో సమగ్రంగా చర్చించవలసిన సమస్య యథేచ్ఛగా అన్ని అవకాశాలను పురుషుడితోపాటుగా అనుభవించటానికి స్త్రీలకు తగిన వసతులు కల్పించినట్లయితే, స్త్రీవిద్యాభివృద్ధి నిరాటంకంగా సాగిపోతుందికాని 'స్త్రీలకనవసరం కాబట్టీ, స్త్రీలు ఎక్కువమంది పాల్గొనటంలేదు కాబట్టీ, 'ఈ సంస్థను మూసివేయడమైంది; ఆ సంస్థ ఎత్తివేయడమైనది' అని సమర్థించి, వారి అవకాశాలను పరిమితం చేయటంవల్ల,

# కట్టూ, బొట్టూ

## ★ జడలు; వాటి తీరు ★

మెడ్రాసు మెడికల్ కాలేజీలో ఈమధ్య స్టూడెంట్స్ కట్టూబొట్టూ ఎలా ఉండాలో శాసించే రూల్సు కొన్ని అమలులో పెట్టారు.

ఆడా మొగా అందరూ సాధ్యమైనంత వరకు తెల్లటిబట్టలే వేసుకోవాలనీ, ఆడపిల్ల రంగుచీరలు కట్టుకున్నా అవి లేతరంగులో ఉండాలనీ ఆ రూల్సులో ఉంది. పైగా ఆడపిల్లలు జడ వేసుకోకూడదు. పువ్వులు బొత్తిగా పెట్టుకోకూడదు అని కూడా ఉంది.

ముఖ్యంగా ఇందులో ఆడ స్టూడెంట్ల రూల్సు విషయంలో చాలామందికి కోపంగా ఉంది. హక్కుల గురించి ముఖ్యంగా స్త్రీల హక్కుల గురించి ఇంగ్లీషులో నే మాట్లాడే మా వదిన ఫ్రెండు ఒకావిడ 'అట్రాషస్' 'హారిబుల్' 'టూమచ్' అంటూ కోప్పడింది. మా వదిన కాస్త తిటపటాయించి "యస్" అనేసింది. మా వదిన కూడా సోషలైటు. (ఈ మధ్యనే ఒక సొసైటీ పత్రికలో, ఎవరి బొమ్మ క్రిందనో మా వదిన పేరు రాసేసి, ఈవిడి గొప్ప సోషలైటు అని రాసేశారు) ఆ పైన జడ, జడలో పువ్వులూ నిషేధించడం ఎంత తప్పన్న విషయమై ఇద్దరూ మాట్లాడుకున్నారు. మీరు చెప్పేది రైటే నండీ అన్నాను నేను. వినయంగా నవ్వుతూ రైటు కాక? అంది ఆవిడ ఓ మోస్తరుగా నవ్వుతూ. నా వేపు కొంచెంసేపు చూడగానే ఆవిడకి

**సి. వి. విజయలక్ష్మి**

అనుమానం కలిగింది కాబోలు; మొహంలో ఓ మోస్తరు చిరాకు ప్రదర్శించింది.

నాకు నవ్వొచ్చింది, అందుకని నవ్వాను. అందుకని ఆవిడకి కోపం వచ్చింది

కల్చర్ ఉన్నవాళ్లు కోపం వచ్చినపుడు కోపాన్ని చూపించకూడదు. అందుకని, ఆవిడ మళ్లీ ఓ మోస్తరుగా నవ్వేసింది. ఆవిడ ఎప్పుడూ ఇంతే. పారిస్ నగరంలో ఫాషన్లు మారిపోయినంత దబ్బున ఆవిడ మొహంలో మోస్తరు మారిపోతాయి. మనషులంటే తగని అనుమానం. నేనంటే మరీని. అందర్నీ, హేళన చేస్తానని. ముఖ్యంగా ఆవిడని నేను వినయంగా నవ్వుతూ చెప్పినా సరే

స్త్రీల హక్కులగురించి ఆవిడ మాట్లాడుతున్నపుడు నేను ఇలానవ్వడంవల్ల ఆవిడకు కోపం వచ్చింది.

"హక్కులు లేవు లేవని గోలపెడతారు. ఉన్నవాటి గురించి, ఆడపిల్లవి నువ్వే ఇలా తేలిగ్గా నవ్వితే ఎలా అని విసుక్కుంది. మెడికల్ కాలేజిలో రూల్సు మొగాళ్లకి కూడా పెట్టారుగా అంది వదిన.

మొగాళ్లకి ఆ రూల్సు ఏమంత ఇబ్బంది కలిగించేవి కావు అని నా అభిప్రాయం. ఎందుకంటే, మొగాళ్ళు ఎంత ఫాషనబుల్ గా ఉండాలన్నా, ఎంత ఖరీదైన గుడ్డలు కొన్నా, సాధారణంగా సూట్లు, కన్ను చెదరగొట్టే రంగుల్లో కుట్టించుకోరు. బూడిద రంగు, లేత క్రీంకలర్, లేత నీలం లాంటివే. చాలామంది తెల్లటివే కొంటారు. అమెరికన్ ఫాషన్లు ఇమిటేట్ చేసే వాళ్లు మాత్రం రంగుల బొమ్మలు, రాజకీయవార్తలూ, అచ్చుకొట్టిన న్యూస్ పేపరు చొక్కాలు అవీ కుట్టించుకుంటారు. ఇంక ఉంటే గింటే, కంటికి నదరుగా ఉండేది 'టై' ఒక్కటే. ఇది దండుగ అని చాలామంది అనుకుంటున్నారు. ఆ మధ్య, బ్రిటనులో కూడా కొందరు ఇలాగే అనుకున్నారు. అందుకని, చిన్న దుమారం లేవతీశారు. చలి బాధ లేకుండా చొక్కాను బిగించి ఉంచడానికి కదా టై అనేది వచ్చిందీ, చలి లేనప్పుడు కూడా టై ఉండడము ఎందుకూ, కొన్ని ఫాషన్ రూల్సుకు బానిసలం అవడం కాదా అంటూ వాళ్లు వాదించారు. అసలు ఆ దేశంలో వేషధారణ పద్ధతులు సంఘంలో ఆచారాలు, మర్యాదలుగా కాక, రాసిపెటని శాసనాలుగా తయారయ్యాయి. చాలా రోజుల క్రితం వీటెనిగూడా కొందరు ఎదిరించారు. ముఖ్యముగా ఈ 'టై' మర్యాదమీద బయలుదేరిన బానిసత్వ సిద్ధాంతం మనదేశంలో బాగా వర్తిస్తుంద అని నా అభిప్రాయం.

ఇందువల్ల ముఖ్యంగా ఆడపిల్లల డ్రెస్ విషయంలో రూల్సుని కొందరు విమర్శించుతున్నారు. ఈ రూల్సు ఒక కాలేజీ వే కావచ్చును. కాలేజీ వాళ్ళకి అందుకు అధికారాలూ ఉండవచ్చు అక్కడ చదువుకునే వాళ్ళు చాలామందికి నచ్చవచ్చు. నచ్చకపోయినా సర్దుకు ఊరుకోనూవచ్చు. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారు ఏన్నార్థం క్రితం శార్టోరియల్ రూల్సు పెట్టారు. ఉద్యోగులు ఆఫీసు టైములో వాటిని అమలు జరుపుతూనే వున్నారు.

కాని, అసలు ప్రిన్సిపుల్ దగ్గరికి వస్తేనే చిక్కు. హిందూదేశంలో ఆడపిల్ల పువ్వులు పెట్టుకోకూడదని ఆజ్ఞాపించడం బాధాకరం.

---

## స్త్రీలకు ప్రత్యేక విద్య

స్త్రీజాతికి అన్యాయం జరుగుతుంది. వారి అభివృద్ధికి ఆటంకం కలుగుతుంది.

స్త్రీలకు అన్నిటిలో, అన్నివిధాలా విద్య నార్జించటానికి తగిన అవకాశాలు కల్పించితేనేగాని, స్త్రీవిద్యాభివృద్ధి చెందదు. స్త్రీలు యథేచ్ఛగా విద్యాభ్యాసం చేయటానికి తగినవసతులు కల్పించాలి. స్త్రీలకు ప్రత్యేక కళాశాలలు, ప్రత్యేక విద్యావిధానంలో మాత్రమే ఉండేటయితే ఇతరకోర్సులు కావలెననుకొన్నవారు, సహ విద్యావిధానాన్ని ఆమోదించి తీరవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

స్త్రీవిద్యాభివృద్ధిని కోరే అనుభవజ్ఞులు విద్యావేత్తలు పై అంశాలను గమనించి నిర్ణయాలను చేసినటయితే, స్త్రీలు యథేచ్ఛగా విద్యార్జన చేయుగలుగుతారు. వారి కేటువంటివిద్య అవసరమో వారే నిర్ణయించుకొంటారు. ★

#  కట్టూ - బొట్టూ 

పువ్వులు ఫాషన్ కాదనుకునేవారి సంగతి వేరు. ఇలాంటివారు ఆట్టే మంది లేరు. పువ్వులు అందమైన ఆభరణాలు. గొప్పవి వాటని, మనదేశంలో ఉపయోగించినంత చక్కగా అద్భుతంగా ఏ ఇతర దేశంలోనూ 'ఇంతమంది' వాడరు. హవాయిలాంటి పసిఫిక్ ద్వీపాలలో ఆడామగా కూడా దండలు వేసుకుని తిరగడం అమెరికన్ సినిమాలలో చూస్తాం. పారిస్, లండన్, లాస్ ఏంజెల్స్, న్యూయార్క్ వంటిచోట్ల, ఆడవాళ్లు టోపీలకి పువ్వులూ ఆకులూ, కొంతమంది పళ్లు కాయలూ గుచ్చుకుని ఫోటోల్లో పడతారు. కాని, నొసట చక్కని బొట్టు, పెట్టుకుని తలలో పూలచెండు తురుముకునే వాళ్లు, మనదేశంలో, ముఖ్యంగా దక్షిణ భారతంలోనే కనబడతారు.

జవహర్లాల్ నెహ్రూగారు ఒకచక్కని గులాబి పువ్వుని కోటుబటన్ హోల్ లో పెట్టుకుంటారు. పువ్వుల్ని అలంకారంగా ఇళ్లలో పెడతారు రోగులకు అందంగా కనబడి ఆనందం కలిగిస్తాయని, పువ్వుల కుండీలను గవర్నమెంటు ఆస్పత్రిలలో పెడతారు ఇలా పువ్వుల గురించి నేను పెద్ద కాంపోజిషన్ రాయగలను.

మా వదినె ఫ్రెండుకూడా పువ్వులు మంచివేఅని ఒప్పుకుంటుంది. ఆడపిల్లలు పువ్వులు పెట్టుకోకూడదనడం ఇంజస్టిస్ అంటుంది.

"మీరుచెప్పింది రైటేనండి ఈ ఇండియన్స్ అందరికీ పువ్వులంటే చాలా ఇష్టం" అన్నాను నేను వినయంగా నవ్వుతూ

ఆవిడ మొహంలో గబ గబ రంగులు మారాయి. కోపం వచ్చేసింది నేను హేళన చేస్తున్నానని. ఆవిడ పెద్ద సోషలైటు కాబట్టి ఇండియానే అయినా, మన దేశంవాళ్ల సంగతి మాట్లాడినప్పుడు (తరచుగా ఈ సంగతి గాదు) ఈ ఇండియన్స్, ఈ ఇండియా అంటుంది. ఆవిడ అంటుందిగదా అనే నేనూ అన్నాను వినయంగానే.

కోపంవచ్చినా, కల్చరుంది కాబట్టి, ఆవిడ మృదువుగా నన్ను చూపులతో పొడి చేస్తూ లేచి నిల్చుంది ఏమైనా, "యిండియన్ గర్ల్స్ జడ వేసుకోకూడదనడం, పువ్వులు పెట్టుకోకూడదనడం నాకు నచ్చలేదు" అనేసి చక్కాపోయింది.

ఆవిడ వెళ్ళగానే మా అన్నయ్య వచ్చేడు ఆవిడ ఉండగా మా అన్నయ్య ఎప్పుడూ రాడు. ఆవిడ ఇంగ్లీషులో తప్ప ఇంకో భాషలో మాట్లాడదు మా అన్నయ్య సిగ్గుపడిపోతాడు బాధపడలేక.

మీరు ముగురూ ఇప్పటివరకూ జరిపిన చర్చ పరమ చెత్త అన్నాడు మా అన్నయ్య గంభీరంగా. నాన్నగారు కూతవేటు దూరంలో ఎక్కడా లేకపోతే అన్నయ్య చాలా విషయాలు గంభీరంగా చెబుతాడు అయితే ఒకటి ముఖ్యంగా ఈ విషయంలో వాడు కొంచెం గంభీరంగానే మాట్లాడవచ్చు ఎందుకంటే ఎం.బి.బి.యస్. చదువుతున్నాడు.

"మీరు ఇన్ని మాట్లాడుతున్నారుగాని. మా కాలేజిలో ఎవరూ బొట్టెట్టుకోవటం లేదు. పువ్వులెవ్వరూ పెట్టుకురారు జడలు కూడా అంతే" అన్నాడు.

జడలంతే అంటే? జడలు వేసుకు రారంటావా? అన్నాను నేను.

"ఏడిశావు. ఎవరూ జడ వేసుకోరు అన్నా నేను" అన్నాడు అన్నయ్య బలేవిట్టిగా మాట్లాడుతూ.

ఎక్కడనించి వచ్చారో గాని, హఠాత్తుగా మా నాన్నగారు హాల్లోకి వచ్చేశారు. "ఏమిటొయ్ మాట్లాడుతున్నావ్" అన్నారు అన్నయ్యని చూసి.

నాన్నగారూ అన్నయ్యా మాట్లాడుకుంటున్నప్పుడు చూస్తూ ఉండడం నాకు సరదా. ఐసెన్‌హోవర్, ఈడెన్, బుల్గానిన్ పినోల లాంటి బిగ్ త్రీలూ బిగ్ ఫోర్‌లూ కలుసుకున్నంత అరుదు వీళ్ళ సమావేశం. మా అన్నయ్య త్రుళ్ళిపడి, జడేసుకోవటం లేదన్నానండి అన్నాడు.

"ఎవరూ?" అన్నారు నాన్నగారు మమ్మల్ని అన్నయ్య కోప్పడుతున్నాడనుకుని. కాని కంగారులో అన్నయ్య బుర్ర ఇంకోలా నడిచింది. ఈ మాట ఎవరన్నారని నాన్నగారడుగుతున్నారనుకుని "నేనే నండి" అన్నాడు.

"నువ్వు జడేసుకోవడం లేదంటావా? ఎలా వేసుకుంటావు. క్రూకటూ నువ్వాను."

(అన్నయ్య తల క్రూకట్ ఫాషన్. ఇది అరంగుళం మేకుల్లా జుట్టు కత్తిరించే పద్ధతి. అయినా చూచేవారికి మాత్రం పెద్ద క్రాపింగ్ అన్న భ్రమ కలిగిస్తుంది (ట). ఈ ఫాషన్ "మేడిన్ అమెరికా". దీనికి మూలం - జి ఐ కట్. అమెరికాలో సోల్జరకి, తుప్పజుట్టువల్ల జలుబూ గట్రా చేస్తుందన్న అభిప్రాయంతో అంటకత్తెర వేయించేవారు).

నాన్నగారిమాటకి అన్నయ్య మరింత కంగారుపడి తల తడుముకున్నాడు. "నేను కాదండి. ఐమీన్ ఆడపిలలు. మా కాలేజీలో ఆడపిల్లలు జడేసుకోరంటున్నానండి"

"మరెవరేసుకుంటారు మొగాళ్ళా?"

"అబ్బే అదికాదండి. బన్ చుట్టుకుంటారండి చాలమంది" అన్నాడన్నయ్య సిగ్గుపడుతూ.

"ఎవరూ?" అన్నారు నాన్నగారు ఆశ్చర్యం అభినయిస్తూ.

"ఆడపిల్లలండి."

"వెరీగుడ్. మీ బళ్ళో ఆడపిల్లలు జడేసుకోరంటావు. అంతేకాక బన్ చుట్టుకుంటారంటావు. అయితే ఇప్పుడేం మొచ్చిందట.?"

"అబ్బే వీళ్లకి చెబుతున్నానండి"

"ఎవళ్లకి?" అన్నారు. నాన్నగారు నవ్వుతూ.

"వీళ్ళకే" అంటూ వెనక్కి తిరిగాడు. అన్నయ్య. మేము అక్కడ లేముగా.

నాన్నగారితో అన్నయ్య ఇంటర్వ్యూ చూడడం వదినకి అట్టే సయించదు. అందుకని ఆరంభంలోనే లేచి పక్క గదిలోకి వెళ్లి పోయింది. నేను వెళ్ళిపోయి, కర్టెన్ అవతలనించి చూస్తున్నానన్నమాట.

నాన్నగారు వెళ్ళిపోగానే అన్నయ్య, గజంబద్ద మింగేసిన వాడిలా నిటారుగా నిలచి నడుస్తూ వచ్చాడు.

"అంచేత నా మాట నిజం. చాలామంది సిగ చుట్టుకుంటారు. కొందరు బన్ చుడతారు. కాటన్‌రోల్స్ పెట్టి. అసలు ఈ విషయంలో మా ఫ్రెండు అభిప్రాయం ఏమిటంటే—"

అన్నయ్య ఫ్రెండ్స్ చాలా మంది ఫాషన్ బుల్ సర్కిల్‌లో తిరిగే మనుషులు. అమ్యా ఒక ఫ్రెండు, తన చెల్లెలి స్నేహితురాలితో మాట్లాడుతూ "ఆడ్రీ హెప్‌బర్న్" కట్ ఆ అమ్మాయికి చాలా బాగుంటుందని సలహా యిచ్చాడు. అంటే క్రాపింగ్ చేయించుకోమని భావం ఆడ్రీ హెప్‌బర్న్ సినిమా స్టార్. చాలాబాగుంటుంది. ఆ దేశం (బ్రిటన్) లో ఆ సమాజంలో, ఆమె క్రాపింగ్ చేయించుకున్నా నప్పుతుంది. ఒప్పుతుంది. వరవడి అవుతుంది. నిజంగా అలాగే జరిగింది. "రోమన్ హాలిడే," "సబ్రినా" సినిమాలలో ఆమెను చూచిన బ్రిటిష్ అమ్మాయిలు చాల మంది ఆఫక్కలో క్రాపింగ్‌లు చేయించుకున్నారట.

అలాగే ఈ మధ్య, సోవియట్ డిప్యూటీ ప్రైమ్ మినిష్టరు మాలెంకోవ్ బ్రిటన్ వెళ్లాడు. మాలెంకోవ్ పచ్చగా బొద్దుగా ఉంటాడు. ఆయన ముఖం గుండ్రంగా నిండుగా ఉంటుంది. నుదురుమీద క్రాపింగ్ ముంగురుల కట్ట ఒకటి (స్ట్రైండ్) 'S" ఆకారంలో ఉంటుంది. అది చాలా ఆకర్షణీయంగా ఉన్నదని బ్రిటిష్ ఫాషన్ బుల్ సర్కిల్స్‌లో అనుకున్నారు. పురోగాములైన మహిళలు కొందరు తక్షణమే, జుట్టు ముందరి భాగం ఆఫక్కలో కత్తిరించుకుని, నుదురు మీద, అటువంటి స్ట్రైండ్ పెట్టుకు ముచ్చట పడ్డారు.

వాళ్లు కాపీ చేశారని, మన దేశంలా మనము బయలుదేర లేము గదా. మన సమాజములో మనకు లక్షణమైన కట్టుబొట్టూ తీరు తెన్నూ ఉన్నాయి. ఇప్పుడు కాలేజీలో జడవేసుకో కూడదని సిగచుట్టుకోవాలన్నారు.

నామటుకు నేను ఇటు సిగ, అటు జడా (ఒకటికాదు మూడు జతల జడలలాటివి) కూడా ఉండే పద్ధతిలో తలదువ్వుకుంటాను. కొంచెం కష్టమే. చెల్లాయో వదినో సాయం చెయ్యాలికూడా.

పద్ధతి: మధ్య పాపిడతీసి జుట్టును రెండు పాయలు చెయ్యడం. చెరో పాయలోనూ ముంగురుల దగ్గరనుండి కొంత జుట్టు విడతియాలి. దాన్ని సన్నగా దువ్వి రెండేసి పాయలు (కావాలంటే మూడు) చేసుకోవడం, ఆపైన ఆ పాయలను ఉంగరాలు తిరిగేలా మెలిపెటి, ముందర వేపు 'వేవ్' వచ్చేలా తీర్చిదిద్దుకోవాలి. మిగతా ఉంగరాల కట్టలను చెవుల వెనక నించి మెడమీదుగా క్రిందికి దింపాలి. అక్కడనించి భుజంమీదుగా ముందరకి వదిలేయవచ్చు. ఉంగరాలుగా చుట్టినందువల్ల ఇవి పొట్టిగా నే ఉంటాయి.

ఇంక, మిగతా జుట్టుకు చివరకంటా పాపిడతీసి, రెండు పాయల్ని (బన్ సిగలకిలాగే) ఉలెన్ రోల్స సహాయంతో కజ్జికాయలలా చుట్టేసుకోవాలి. అప్పుడు వెనక సిగ, ముందు జడా తయారవుతాయి. అప్పుడూ సిగలో పువ్వులు తురుముకుంటే బాగుంటుంది. 

# సినిమా

## ★ అనుపమ వారి "ముద్దుబిడ్డ" ★

మంచి కథ, మంచి నటన, కథకు తగిన విధంగా చక్కని సంగీతం, సాహిత్యం, ప్రతిభగల దర్శకత్వం కలసినఫలితం అనుపమా ఫిలింస్ వారి చిత్రం "ముద్దుబిడ్డ". స్వతంత్ర దర్శకుడుగా శ్రీ తిలక్ చేసిన తొలి ప్రయత్నం ఇది బాగా రాణించింది.

దేవకి కడుపున పుట్టి, యశోద చేత పెరిగిన "బిందుగారి అబ్బాయి" (శరత్ నవల) ఈ చిత్రం కథకు మాతృక

వదిన ముద్దుచేస్తే మొద్దో రౌడీయో రాలుగాయో అయిపోతాడని పెంచినతల్లికి బెంగ; ముద్దు అయినా, మొద్దు అయినా మొత్తానికి బిడ్డేగదా అని కన్నతల్లి కనికరించి ఒకరోజున, పిల్లడి తప్పు కప్పి పుచ్చడానికి గుట్టుగా రెండురూపాయలిచ్చింది కన్నతల్లీ, పెంచినతల్లీ తోడికోడళ్ళు కన్నావిడ పెద్దావిడ చిన్నావిడ కలవారి ఇంటిబిడ్డ. కలసికట్టుగా, పొరపొచ్చాలు లేకుండా, రెండు కాపురాలూ ఒక పంచనే సాగుతున్నా చివరికి యీ విషయంలో లీలగా కీచులాటలు తలమాపాయి అపేక్షకి విక్షేపంపంటి హృదయం, మాటపడలేని ఆత్మాభిమానం. తనను అపార్థం చేసుకుంటున్నారన్న అనుమానం, అన్నీ ఉన్న చిన్నామె, తొందరపడుతుంది మాటమీద మాట పెరుగుతుంది సమష్టి కుటుంబంలో బొత్తు విరిగినంతపని అవుతుంది దీనికితోడు ఇంటి ఆడపడుచు సమయానుకూలంగా చెప్పకూడని మాటలు నాలుగూ చెవి నూరుతుంది.

చివరికి కలతలన్నీ ఎలాగో సర్దుకుంటాయని కథ చదివినవాళ్ళకి తెలిసినా, తెలియనివారు తేలికగా ఊహించుకోగలిగినా, అవి ఎలా సర్దుకున్నాయన్నది చూచి తెలుసుకో తగిన విధంగా దర్శకుడు చిత్రించారు. పసిపిల్లల మనసులో, కూడనిఊహలు ప్రవేశపెట్టడం ఎంత తప్పో, ఏది చెప్పినా మనదారా నమ్మి ఆచరించేవాళ్ళ లేతమనసులకు ఏది పెడితే అది చెప్పి నూరిపోయడం ఎంత



"రేపునీదే"లో రాజసులోచన.

ముప్పో, ఎంతఘోరమో ఈ చిత్రంలో నిరూపించారు అపేక్ష, మంచితనం, ఆనందం ప్రధానపాత్రలుగా, చెప్పుడు మాటలూ, అపోహలూ, తొందరపాటూ, వాటి పాలిట 'విలన్'లుగా కష్టాలుకలతలుగా చిత్రిస్తూ సమష్టి కుటుంబం మనదేశానికి తగినది, ఇది వర్ధిల్లాలని ప్రబోధించడంకోసంగా నిర్మించిన ఈ చిత్రం ఒకసారి చూడతగినది సున్నితమైన హాస్యం, చక్కని నృత్యాలు, హాయిగా వినిపించే పాటలూ, ఎబ్బెట్టు అనిపించనిరీతిలోనే చొప్పించడానికి మంచి ప్రయత్నం చేశారు పులివేషం ఈ చిత్రంలో విశేషాకర్షణ దీనికి ఏసుదాసు అమృతయ్య డప్పుల వాద్యంతోనే ఉపక్రమములు వేసి ఒప్పించారు

లక్ష్మీరాజ్యం, జమున, సూర్యకాంతం, విజయలక్ష్మి, నాగయ్య, జగ్గయ్య, సి. ఎస్. ఆర్., పేకేటి, చదలవాడ, రమణారెడ్డి, పెరుమాళ్ళు, బొడ్డపాటి, అల్లు రామలింగయ్య మాస్టర్ శర్మ, ముద్దుబిడ్డగా మాస్టర్ వెంకటేశ్వర్ నటించారు టైగర్ జోగారావు పులివేషం కట్టాడు ఇ. వి. సరోజ, మీనాక్షి నృత్యాలు చేశారు

శ్రీ తాపి ధర్మారావుగారు మాటలూ శ్రీ ఆరుద్ర పాటలూ వ్రాశారు. ఆరుద్రగారి పాటల సాహిత్యం తెలుగుతనంతో బాగా ఒప్పింది 'థీమ్ సాంగ్' అనతగ్గ "ఎవరు కన్నా రెవరు పెంచారు" అన్న పాట, పాటవరస సర్వత్రా అభిమానపాత్రములవుతాయి శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారు ఈ చిత్రంలో చక్కని తెలుగు సంగీతాన్ని అందించారు

ఈ చిత్రానికి చిత్రలక్ష్మణ్ గోరే ఛాయాగ్రహణం, శ్రీ జె. సూర్యనారాయణ శబ్దగ్రహణం నిర్వహించారు ★

'స్వయంప్రభ' లో శ్రీరంజని.

# సినిమా వార్తలు

భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి కొత్తచిత్రం (నెం 3) "రేపు నీదే" పూర్తి అయినట్లే. వచ్చేనెల విడుదలచేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి

ఇందులో రంగారావు, రేలంగి, జగ్గయ్య రాజసులోచన, జానకి, కృష్ణకుమారి మొదలగువారు పాల్గొన్నారు రచన శ్రీ కొండముది గోపాలరాయశర్మ సంగీతం శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు, దర్శకుడు శ్రీ భాస్కరరావు భాస్కర్ వారి నాల్గో చిత్రంకూడా తయారవుతోంది దీనికి శ్రీ సముద్రాల జూనియర్ రచన, శ్రీ రమేష్ నాయుడు సంగీతం. దర్శకుడు శ్రీ భాస్కరరావు

* * *

వహీవారి "శ్రీ గౌరీ మహాత్మ్యం" అక్టోబరు 5న విడుదల అవుతోంది శ్రీ యోగానంద్ దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో రామారావు, శ్రీరంజని, రేలంగి, సూర్యకళ, కాంతారావు, ముక్కామల పాల్గొన్నారు. రచన శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి

* * *

జోయా పిక్చర్స్‌వారి "బాలసన్యాసమ్మ కథ" ఈనెల 26న విడుదల అవుతోంది కృష్ణకుమారి, చలం, జి వరలక్ష్మి, జగ్గయ్య సూర్యకాంతం, రేలంగి మొదలగువారు నటించారు రచన సముద్రాల. సంగీతం: శ్రీ రాజేశ్వరరావు, దర్శకుడు నిర్మాత పి సుబ్బారావు.

* * *

ఆర్. ఎన్ ఆర్ పిక్చర్స్‌వారు "ప్రేమే దైవం" అనే సాంఘిక చిత్రం నిర్మిస్తున్నారు శ్రీ ఆర్. నాగేంద్రరావు (నాగుల చవితి) ఈ చిత్రానికి దర్శకత్వం నిర్వహిస్తారు

శ్రీరంజని, సంధ్య, రామారావు, కల్యాణకుమార్ పాల్గొంటున్నారు. సంభాషణలు శ్రీ జి కృష్ణమూర్తి వ్రాశారు సంగీతం శ్రీ పద్మనాభ శాస్త్రి స్టుడియో రోహిణి ఇప్పటికి ఐదు రీళ్ళు ఎడిట్ చేశారు మూడుపాటలు రికార్డయ్యాయి ఇవి పాణిగ్రాహి పాడినవి.

* * *

అర్చనా ఫిలింస్ అనే కొత్తసంస్థకు ఇటీవల ప్రారంభోత్సవం జరిగింది. వీరు హిందీలోనూ, తమిళంలోనూ చిత్ర నిర్మాణానికి పూనుకున్నట్లు తెలియచేశారు హిందీ చిత్రం పేరు "గునియావాసే", తమిళ చిత్రం పేరు "అప్పర్". హిందీచిత్రానికి శ్రీ దివకర్ రావ్ రావ్, తమిళచిత్రానికి శ్రీ టి. కె. జానకిరాం సంగీతం సమకూర్చుతున్నారు. శ్రీ ఎన్ కె వాసగం రెండిటికీ దర్శకుడు.

జిక్కి ఈమధ్యనే హిందీచిత్రానికి "మెరె బోలా బలమ్", "దునియావాలో" అనే రెండుపాటలు పాడింది. రికార్డింగు రేవతీ స్టూడియోలో జరిగింది.





కల్పన, దేవానంద్, వారికుమారుడు సునీల్.



భాస్కర్ వారి "రేపునీదే" లో రంగారావు, జానకి, మోహనదాసు.

# బొంబాయి సినిమా లేఖ

బి. ఆర్ చోప్రా తీసే చిత్రం "నయా దౌర్"లో మధుబాలను తొలగించి, ఆ భూమికను వైజయంతిమాలకు ఇచ్చారు. నిజానికి మధుబాల ఈ చిత్రం విషయంలో చోప్రాతో కాంట్రాక్టువంటిదేమీ వ్రాసుకోలేదు. మొత్తంమీద, ఈ వార్త విన్నప్పుడు, అసలిటువంటి తతభావతులు రావడానికి క్షీణ భారత నిర్మాతలే కారణం అని ఇక్కడి నిర్మాతలు కొందరు అంటున్నారు. బాక్సాఫీస్ చిత్రాల నిర్మాణం పేరిట దక్షిణాది నిర్మాతలు బొంబాయి నటీనటులను బుక్ చేసి, వారివిషయంలో, మహా ఉదారంగా వ్యవహరిస్తున్నారనీ, వారలా మప్పి పెట్టినందువల బొంబాయి తారలంతా వరీ మిగిలిగిసి కూర్చుంటున్నారనీ, బ్లాక్ మార్కెట్ రేట్లు మిన్నంటుతున్నాయనీ విమర్శిస్తున్నారు. ఈ నటీనటులంతా, ఇక్కడిలాగే, దక్షిణాదిని కూడా బేఖాతరీగా వ్యవహరిస్తే సరి అని కొందరు ప్రముఖుల అభిప్రాయం.

*   *   *   *

తమిళనటుడు, బహుముఖ ప్రజ్ఞావంతుడు అయిన రంజన్ మానసికంగాను, దైహికంగాకూడా అస్వస్థత పొందినట్లు తెలియవచ్చింది చార్నిరోడ్‌లోని పోలీస్ ఆస్పత్రిలో ఆయన ఇప్పుడు క్రమంగా కోలుకొంటున్నాడు వారం పదిరోజుల క్రితం ఆయన మేడమెట్లమీదనుండి దొర్లి పడిపోయాడు ఇపుడు రంజన్ తల్లి, సోదరుడూ దగ్గరఉండి సపర్యలు చేస్తున్నారు.

ఇక్కడ ధీరుభాయ్ దేశాయ్ నిర్మిస్తున్న "బకావళి" చిత్రంలో రంజన్ ముఖ్య భూమిక నిర్వహిస్తున్నారు మానసికమైన అశాంతికి ఇక్కడ రెండువిధాలకారణాలు చెప్పుకుంటున్నారు. రంజన్‌కు మంత్ర శాస్త్రం అంటే చాలా అభిమానమనీ, ఏవో సిద్ధులకోసం ప్రయత్నాలు చేస్తున్నాడనీ కొందరు అంటున్నారు కుటుంబవిషయాలే కారణమని మరికొందరి అభిప్రాయం. రంజన్ ఇపుడు ఇలా అస్వస్థతతో తీసుకొంటున్నా, ఆయన భార్య ఆస్పత్రికి వస్తున్నట్లు కనబడదు

*   *   *

గతవారం రెండు చిత్రాలు విడుదల అయ్యాయి

ఒకటి హెచ్ ఎస్ రవైల్ చిత్రం 'పాకెట్ మార్' (జేబు దొంగ) పొట్ట పోషించుకోవడానికి దొంగతనం సాగించిన మనిషికథ ఒకరోజున ఈ దొంగ, దారి

# బొంబాయి సినిమా లేఖ

వెంటపోయే ఒక యువకుడి జేబు సవరించి, పర్సు పుచ్చుకుంటాడు. తత్ఫలితంగా ఆ యువకుడు ఆత్మహత్య చేసుకుంటాడు. ఈ సంఘటన దొంగమనసును విరిచివేస్తుంది. మార్చివేస్తుంది. ఆ పర్సును చనిపోయిన యువకుడి తల్లికి ఒప్పగించబోయి, అతడి చెల్లెల్ని చూచి వలచి వరించి వివాహం చేసుకుంటాడు.

కథ పెళ్ళిఘట్టానికి వచ్చేలోగా, దొంగ చెడుదారివదలి రహదారిమీదకు రాబోతాడు. అలా రావడానికి, అంతకాలం అతగాడి జతగాళ్లుగా వచ్చిన దొంగల ముఠావాళ్ళు ఆటంకపరుస్తారు. పైగా, ఆ ముఠాలో, ఇతగాణ్ణి వలచి వలపించుకోలేని





“జాగ్ తే రహో” ఆలిండియా ప్రీమియర్ (ప్లాజా)కుమద్రాసు వచ్చిన రాజ్ కపూర్.

‘రాణి’ ఒకర్త ప్రాణం విసుగెత్తిన ఆరాణి చివరకు పగతీర్చుకోజూస్తుంది. ప్రధాన భూమిక నిర్వహించిన దేవానంద్ నటనవల్ల ఈ కథ మరింత రక్తికట్టింది. జేబుదొంగ భార్యగా గీతాబాలి, తల్లిగా లలితాపావర్, వాంప్ గా నదిరా, గోప్, సుందర్ ప్రభృతులంతా చక్కగా నటించారు. దర్శకత్వం కూడా ప్రతిభావంతంగా ఉంది. సంగీతం (మదన్ మోహన్) తప్ప మిగతా హంగులన్నీ బాగున్నాయి.

మొన్న విడుదలఅయిన మరో చిత్రం ‘జిందగీకే మేలే’. కిషన్ చందర్ నవల దీనికి ఆధారం. దర్శకుడు కె. బి. లాల్. వరకట్న దురాచారంవల్ల ఒక కుటుంబంపడ్డ అవస్థలు ఇతివృత్తం. ఇందులో ప్రధానపాత్ర దైవభీతి, పాపభీతిఉన్న ఒక స్టేషన్‌మాస్టర్ ది. గజానన్ జాగీర్దార్ ఈ భూమికను అద్భుతంగా నిర్వహించారు. ఇందులో ఆయన నటన అత్యుత్తమస్థాయిని అందుకున్నది. యాకూబ్, లలితాపావర్, చిత్ర, బాబూరజె, మినూముంతాజ్, చంద్రశేఖర్ ప్రభృతి నటీనటులంతా కూడా చక్కని నటన ప్రదర్శించారు. మద్రాసుకు చెందిన నర్తకీద్వయం సాయి, సుబ్బలక్ష్మి ఈ చిత్రంలో చేసిన నృత్యం ప్రత్యేకాకర్షణ. చిన్నా పెద్దా అందరూ చూచి ఆనందించదగ్గ చిత్రం “జిందగీకే మేలే”.

★

(ఆంధ్రవారపత్రిక బొంబాయి విలేఖరి)

చలనచిత్ర కథ:

# రాజుగారి రహస్యం

“కొత్త ఏరు దాటిస్తావా కప్పా?” అని అడిగింది ఒక తేలు.

“నీగుణం చెడ్డది. తీరా ఏరుదాటించాక, నన్ను కుట్టి మరీ పోతావు” అంది కప్ప.

కుట్టబోవడం తేలుగుణం.

ఇలాంటి పిట్టకథలు చెప్పి, చుట్టూ వున్నవారిని ముగ్ధుల్ని చేయడం గ్రెగరీ అర్కాడీ అనే కోటీశ్వరుడి గుణం. తననిండా చీకటి నింపుకుని, చీకటి మధ్య తను వెల్గా ఉంచడం కూడా ఒకగుణంగా అబ్బింది. కోటీశ్వరుడు కొంటె ఈ గుణాలగురించి ఈ గుణాల వాలుడిగురించి, కొల్లలుగా కట్టుకథలు చెలామణీ అయ్యేవి.

అర్కాడీ అసలు కథమాత్రం ఎవరికీ తెలియదు. తెలుసుకుంటే చాలాకథ ఉందని, డబ్బు పుష్కలంగా దొరుకుతుందని స్ట్రాటన్ అనే అమెరికన్ యువకుడికి తెలిసింది. స్ట్రాటన్ చీకటిజీవుల కోవలోవాడు. డబ్బు అంటే చాలా సరదా. బోలెడు ఆశ. ఒకరోజు రాత్రివేళ, నేపుల్స్ హార్బర్ లో శవం కాబోతున్న ఒక వ్యక్తి అతడికి తటస్థపడింది. స్ట్రాటన్ జాలిపడి సాయపడబోయాడు.. కాని, అది “వీపుమీద బాకు మార్కు” ఖూనీకేసు. చనిపోయే క్షణాలలో, ఆ మనిషి స్ట్రాటన్ కి “అర్కాడీ, సోఫియా” అనే రెండు పేరుచెప్పాడు. అవి గుర్తుంచుకుంటే డబ్బు దొరుకుతుందని ఉపదేశించి, మరణించాడు.

కోటీశ్వరుడైన అర్కాడీ దగ్గర ఈ తారకమంత్రం చదివితే డబ్బు పలుకుతుందన్న ఆశతో స్ట్రాటన్ ముందర అర్కాడీ కుమార్తెతో చెలిమి కలపచూచాడు. మొండికత్తి, బరితెగించి, వెంట బడుతున్న ఈ స్ట్రాటన్ను చూచి ఆ పిల్ల ముచ్చటపడింది.

అర్కాడీ చారచతువు. అతనికి ఇక ముప్పైమంది సెక్రటరీలే ఉన్నారు. ఒకింతదరూ ఏలో పనీ చూసినా, అందరూ చేయవలసిన ఒక పని, ప్రతిఒక్కరూ అర్కాడీ కుమార్తెని, వెయ్యికళ్ళతో కనిపెట్టడం. తన పుట్టుపూర్వాల విషయం గాని, మరేసంగతి గాని కుమార్తెకు తెలియడం అర్కాడీకి సుతరామూ ఇష్టంలేదు. ఆమె అంటే పంచప్రాణాలూను. ఎంత ప్రేమో, అంత భయం

కూడా. తను ప్రవ్వల్లే ఇంత పదిలంగా పెంచుకుంటున్న తనకుమార్తెని మంచి చేసుకుంటున్న చిన్నవాడి మంచిచెడ్డలగురించి అకార్డీ కూపీ తీయించాడు. స్టాంటన్ కథ ఏమంత అమోఘమైనది కాదని తేలింది ఈ రోమియో తనకుమార్తె నీడకూడా చూడరానివాడని నిశ్చయించుకున్నాడు

ఒకరోజున, స్టాంటన్‌ను చాటుకి పిలిచి, హెచ్చరించాడు. తనకూతురు రైనా జోలికి పోవద్దన్నాడు. అంతలోనే రైనా కూడా వచ్చింది స్టాంటన్ తనకు తెలిసిన "తారక మంత్రం" ఉచ్చరించి అప్పటికి తప్పుకు పోయాడు. మర్నాడు అకార్డీ స్టాంటన్‌ను తిరిగి పిలిపించాడు. తారకమంత్రం వైనం తరచి తరచి అడిగాడు అక్కడితో స్టాంటన్ సంగతి తేలిపోయింది.

నన్నుగురించి లేనిపోని రహస్యాలు తయారుచేసి బుకాయింపచూశావు నిన్న. ఇది "నికార్సయిన బ్లాక్ మెయిలింగ్" అని గదమాయించాడు అకార్డీ.

తరవాత సముదాయించాడు.

"చూడు అబ్బాయ్ నువ్వు డబ్బుకోసం కాదా నన్ను డబాయించ సిద్ధపడ్డావు నీకు పుష్టిగా డబ్బిస్తా; నాకోపని చేసిపెట్టు," అన్నాడు.

సై అన్నాడు స్టాంటన్.

"1927కు పూర్వం నేనెవడినో నా పేరేమిటో ఊరేదో, కథ అంతా రహస్యంగా ఆరాతీసి, నాకు రాసివియ్యి" అని కోరాడు అకార్డీ.



"భారతి" చిత్రంలో రాణిగా నిమ్మీ.

1927లో తను పరమదరిద్రుడుగా ఉన్న వైనం తప్ప ఇంకేమీ గుర్తులేదట అతడికి. వెనకటి కథంతా కావాలి దీనికి ఐదు వేలిస్తానన్నాడు.

సై అన్నాడు స్టాంటన్.

స్పెయిన్, ఇటలీ, ఫ్రాన్సు, పోలెండ్, జర్మనీ ప్రభృతి యూరప్ దేశాలన్నీ పర్యటించాడు. ప్రముఖ నగరాలలోని "చీకటి తావుల"కు యాత్రలు చేశాడు. దొంగలు, త్రాగుబోతులు, బ్లాక్ మెయిలర్‌లు ఇంకా రకరకాలవాళ్ళు, ఎందరినో సందర్శించాడు. విచ్చలవిడిగా డబ్బు వెదజల్లి చకచక సమాచారం సంపాదించుకుంటూ ఊరూరా తిరగసాగాడు చివరికి, నేపుల్సుకి అడుగి చేరాడు తనకి తెలిసిన "తారకమంత్రం"లో రెండో పేరుగల మనిషి 'సోఫియా' అక్కడ ఉంది సోఫియా పేరెకాకుండా గ్రెగరీ అకార్డీ కథంతా చెప్పింది 1927 పూర్వం అతని పేరు చెప్పింది. గడ్డం మీసం లేకుండా, ఉన్న అకార్డీ ఫోటోకూడా చూపించింది.

కాలంవాడు సోఫియా అకార్డీని ప్రగాఢంగా ప్రేమించింది. ఇప్పుడూ అంతే. అప్పట్లో ఆమె, ఆడపిల్లల్ని చేరదీసి పెద్ద ఎత్తున వ్యభిచారగృహం నిర్వహించి బాగా డబ్బుగడించింది. అప్పుడు ఈ అకార్డీ, నేపుల్స్ హార్బర్‌లో హత్యచేయబడ్డ ఆసామి సోఫియా రెండోభర్త, జాక్ అనే మరొకడూ సోఫియా వంతుదారు హఠాత్తుగా ఒకరోజున అకార్డీ, సోఫియా డబ్బు రెండు లక్షలు అపహరించి పారిపోయాడు. ఆ తరవాత దాంతో బాగా ఆర్జించి కోటీశ్వరుడయ్యాడు. పేరు మార్చుకున్నాడు. గడ్డం పెంచాడు. ఎన్ని చేసినా, ఆ పాత ముఠాలో ఎవరో ఎప్పుడో తన సిరిసంపదల మీద విరుచుకపడతారని బెంగ భయం

సోఫియా చెప్పినదీ తనకి తెలిసినదీ కూడగావచ్చిన కథ ఇది స్టాంటన్ విస్తుపోయాడు. సోఫియాదగ్గిర సెలవుతీసుకుని ఇవతలకు వచ్చేసరికి అకార్డీ ప్రత్యక్షమయ్యాడు

స్టాంటన్ పేటకి బయలుదేరిన నాటినుండి అకార్డీ అతణ్ణి రహస్యంగా వెన్నంటివస్తునే ఉన్నాడు. స్టాంటన్ వెళ్లిన ప్రతిచోటుకూ, ఇతడుకూడా చాటుగావెళ్లి సమాచారం కొనుక్కొంటూ వచ్చాడు. స్టాంటన్ తను కనుక్కున్న వివరాలు చెప్పాడు "అయితే, నీకు తెలిసినవన్నీ బుజావు చేయగలవా?" అని అడిగాడు

"దర్జాగా మీఫోటో పుట్టుపూర్వాలూ యావత్తూ సోఫియాదగ్గర ఉన్నాయి" అన్నాడు స్టాంటన్

ఇద్దరూ బయల్దేరి నేపుల్స్ వెళ్లారు. మర్నాటికల్లా సోఫియా, తనకి కొంత సమాచారం చెప్పిన సోఫియా రెండో భర్త, తన తోపాటు నేపుల్స్ హార్బర్‌లో 'తారక మంత్రం' విన్న తన ప్రియురాలు మిల్లీ, హత్యచేయబడ్డట్టు స్టాంటన్‌కు తెలిసింది. మూడూ "వీపుమీద బాకుపోట్ల" హత్యలే. నేపుల్స్ హార్బర్‌లో జరిగిన హత్యకూడా సరిగ్గా ఇదేపద్ధతిలో జరిగింది.

అక్కడితో గ్రెగరీ అకార్డీ వేసుకున్న పథకం పూర్తిగా అర్థమైపోయింది స్టాంటన్‌కు. అకార్డీ తన పాతజీవితపు రహస్యం తెలిసినవాళ్లందర్నీ వరసపెట్టి చంపించి వేస్తున్నాడన్నమాట. కిరాయికి పనిచేసేనేం, మొత్తానికి తనకూ ఇప్పుడు అకార్డీ జీవితరహస్యం తెలుసు. తనూ అతని జాబితాలో ఉన్నట్టే.

ఆత్మరక్షణకు మార్గం ఆలోచించాడు స్టాంటన్ అకార్డీసంగతి తెలిసిన పాత ముఠాలో సోఫియా చెప్పినప్రకారం ఇంకా ఒకడు మిగిలిఉన్నాడు. అతడు కనక ఇప్పుడు తనకి దొరికితే, ఆ సాక్ష్యం సహాయంతో పోలీసుల ఎదటపడి తన ప్రాణం తాను కాపాడుకోవచ్చు స్టాంటన్ ఆ మనిషిని వెతికిపట్టుకున్నాడు. అతణ్ణి తనగదికి తీసుకువెళ్లి రహస్యంగా ఉంచాడు. స్టాంటన్ కన్నుమరుగైన క్షణంలో, అకార్డీ ఆ ఆఖరు సాక్షిని కూడా చంపించివేశాడు. అదికూడా వీపుమీద బాకుతో పొడిచి వేసినదే.

ఇంక, తనే తరువాయి అని గ్రహించిన స్టాంటన్ చివరి ప్రయత్నంగా, సరాసరి అకార్డీ కుమార్తెనే శరణుకోరదలచాడు. ఆమెకు తండ్రి కథ తెలియదు. తను చెబితే తన్ను రక్షిస్తుంది. అకార్డీ ఇక సాహసించలేదు

స్టాంటన్ విమానాశ్రయానికి వెళ్లేసరికి ఒక్కటే టిక్కెట్టు ఉంది. వెంటనే విమానాశ్రయానికి రావలసిందిగా అకార్డీ కుమార్తెకి టెలిగ్రాం ఇచ్చి, విమానం ఎక్కాడు స్టాంటన్.

వెనకనే తరుముతూ వచ్చిన అకార్డీ, స్టాంటన్‌ను విమానం దింపించడానికి శతవిధాల ప్రయత్నించాడు "వాడు నాదగ్గర కొలువుచేస్తూ పారిపోతున్నా"డని ప్రకటించాడు. కాని కేసిరాలేదు పోనీ తనకి టిక్కెట్టు ఇమ్మన్నాడు. అతను ఆ విమానాలకంపెనీలో వాటాదారు అయినా పలుకుబడి పనిచెయ్యలేదు ప్రయాణికులలో ఎవరైనా, తమ టిక్కెట్టు అమ్మితే లక్ష డాలర్లకి కొంటానన్నాడు ఎవరూ నమ్మలేదు అందుకని అమ్మలేదు. నవ్వుకున్నారు విమానం వెళ్ళిపోయింది. అకార్డీకి మతిపోయింది

కొద్దినిముషాలలో ప్రత్యేకం విమానం కుదుర్చుకుని, ఎక్కి వడుపుకుంటూ మాడ్రిడ్ బయల్దేరి వెళ్లాడు, ఆ కొద్ది నిము



ఎ. వి. ఎం. వారి "చోరీచోరీ"లో రాజ్ కపూర్, నర్గీస్.

# రాజుగారి రహస్యం

చాల తేడాలోనే, హ్యామిల్టన్ అక్కడ దిగి, రైనాను కలుసుకొని కొంతకథ చెప్పేశాడు

వెనక విమానంలో వచ్చిన అక్తోర్ని విమానం నేలకి దించకుండా, కంట్రోల్ టవర్ చుట్టూ తిరుగుతూ, రేడియో టెలిఫోన్ ద్వారా తన కూతుర్ని పిలిచాడు ఆమె కంట్రోల్ టవర్ ఎక్కి జవాబు చెప్పింది "అమ్మాయ్ ఆ హ్యామిల్టన్ మాటలు వినొద్దు" అంది విమానంలో తండ్రి కంఠం

"కథంతా తెలిసింది అను" అని ప్రోద్బలం చేశాడు రైనా పక్కనే ఉన్న హ్యామిల్టన్

"అంతా తెలిసింది నాన్నా" అనేసింది రైనా

ఆతరవాత విమానంలోనుండి జవాబు రాలేదు రైనా గొంతు చించుకున్నా లాభం లేకపోయింది విమానం ప్రదక్షిణాలు మానేసి నూటిగా పోసాగింది. చూసెబోయిన మరో విమానంలో వారికి అంగుళంలో అక్తోర్ని కనబడలేదు మనిషి లేని ఆ విమానం అలా పోతూనే ఉంది

అయితే గియితే ఈ కథకు నీతి

అనగనగా ఒక రాజు, కవిని పిలచి "అయ్యా నా సిరిసంపద లెక్కకు రాదు మీకు కావలసినది అడగండి ఇస్తా" అన్నాడు

"ప్రభూ! మీ చిత్తం వచ్చినది ఏదైనా ఇవ్వండి గాని, మీ వ్యక్తిగతమైన రహస్యాన్ని దేన్నిమాత్రం నాకు ప్రసాదించకండి" అని బదులు చెప్పాడు (విజ్ఞుడైన) కవి

ఈ కథను వార్నర్ బ్రదర్స్ వారు "కాన్ఫిడెన్షల్ రిపోర్ట్" అనే పేరుతో చలనచిత్రంగా నిర్మించారు కథ, స్క్రీన్ ప్లే, ప్రసిద్ధ దర్శక నిర్మాత ఆర్సన్ వెల్స్ వ్రాశారు. దర్శకత్వం, ఈ చిత్రంలో అక్తోర్ని భూమిక కూడా ఆయనే నిర్వహించారు అకిం టామిరాఫ్, మైకెల్ రెడ్ గ్రేవ్, పెట్రోషియామడీనా కూడా ఇందులో పాల్గొన్నారు

ఆర్సన్ వెల్స్ ఇతర చిత్రాలలోలాగే, ఇందులో కూడా ఛాయాగ్రహణం విశిష్టంగా, మామూలు చిత్రాలతో పోల్చితే విలక్షణంగా ఉంది కెమెరా విపరీతమైన వేగంతో పరుగెత్తుతుంది ఇది సన్నివేశాల స్వభావాన్ని, కథ బిగువును ఇనుమడింప చేస్తుంది ఒకవిధంగా ఇది కథమీద కథలా ఘట్టంమీద వ్యాఖ్యానంగా భాసిస్తు[...] ఇది ఆర్సన్ వెల్స్ పద్ధతి

కాబట్టి, బాగుండాలన్న ధో[...] ఈపద్ధతిని అంతిగా, అనవసరంగా ఉపయోగించడం ఉద్ధతిగా కనపిస్తుంది అం[...] ఆర్సన్ వెల్స్ ఉద్ధతిని ఏమనాలో తెలియ లేక, ఒకసీను విలేఖరి, "There goes butfor God" అన్నాడు.

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras 1 Editor S Sambhu Prasr



అంతఃలేని ఆలోచన

ఫొటో: జె వి. శివరామశాస్త్రి.






రాజా సులోచన
తెలుపుకు మరియు
శుద్ధతకు
లక్స్
టాయిలెట్ సబ్బును
కోరుకొనును




సినీమా తారలకు సౌందర్యమునిచ్చు
శుద్ధమైన తెల్లని సబ్బు

భారత దేశంలో తయారు చేయబడినది

LTS. 476-X52 TL